మీరు చదువుతున్నారా?

# వనిత



అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో

ఉదయించి పదిహేడు సంవత్సరాలుగా



మన వనితల వికాసానికి తోడ్పడుతున్న

ఏకైక పత్రిక **వనిత**

నెలతల ప్రియ నెచ్చెలి

**వనిత**

- విజ్ఞానానికి
- వికాసానికి
- వినోదానికి

ఇది ఒక జ్యోతి ప్రచురణ






మేగి జిగ్సా పజిల్‌లో
మేగీ సాహసమయ ప్రపంచం
సమకూర్చుకోండి.

మేఘాలలో తేలిపొండి! 'మేగి స్కై
ఫ్లైజర్'లో





మేగి 'ఏస్ ఎడ్వెంచరర్స్ గేమ్'లో
సముద్రం నుండి ఆకాశం వరకు
యాత్రను పూర్తి చేయండి.

మేగి 'హూ-డున్-ఇట్ మిస్టరీ'
గేమ్‌లో దొంగను పట్టుకోండి.

# సరదా ప్రియులకు అద్భుత సాహస యాత్రలు!

## మేగీ క్లబ్ సదస్యులకు ఉచిత బహుమతులు!

ఇతర గ్రహవాసుల చతురతతో
తలపడండి-మీ తెలివితేటలతో 'మేగి
రెయిడర్స్ ఆఫ్ ది రెడ్ స్టార్' గేమ్‌లో






ఏయ్! పిల్లలూ! మేగీక్లబ్‌లో చేరి మేగీ సాహస ప్రపంచంలో ప్రవేశించండి!

మీరు మేగీ నూడుల్స్ యొక్క ఐదు ఖాళీ సంచులకు ముందు వైపున ఉండే ఈ [2-Minute] ను కత్తిరించి మీరు ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం మాకు పంపించండి. అంతే! మీకు 6 నుండి 8 వారాలలో మేగీ క్లబ్ నుండి ఎంతో వినోదాన్నీ ఉత్సాహాన్నీ కలిగించే బహుమతి అందుతుంది.

గుర్తుంచుకోండి! మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు కావలసిన బహుమతితోబాటు మీ పేరు, చిరునామా, మీరు పుట్టిన తేదీని పంపండి. ఈసరికే మీరు మేగీ క్లబ్ సభ్యులైతే మీ సభ్యత్వపు నంబరు పంపండి. ఒకవేళ మీరు మేగీ క్లబ్బర్ కాని పక్షంలో మేగీ క్లబ్ సభ్యత్వం పొందటానికిదే సదవకాశం. పై వివరాలు పంపేటప్పుడు సభ్యత్వం కూడా కావాలని వ్రాయండి. మేము మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డును మీ బహుమతితో బాటు ఉచితంగా పంపుతాము.

మా చిరునామా:

**MAGGI CLUB**
P.O. Box 5788 New Delhi-110 055




ఉచిత మేగీ "వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర్.
మీరు పొందే ప్రతి 2 బహుమతులతో ఒక మేగీ "వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర్ ఉచితం.

మరొక సదుపాయం కూడా! ఈ సరికి మీరు మీ మేగీ బర్డ్ హౌస్‌ను సేకరించనట్లయితే ఇపుడే సేకరించండి!

HTA 7778TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## పండుగలు — జాతీయ సమైక్యత!

ఆగస్టు నెలతో వరుసగా వచ్చే పండుగల హడావుడి మొదలవుతుంది. ఇంచుమించు పండుగలన్నీ కూడా ఏదో ఒక మతానికి సంబంధించినవే అయినప్పటికీ, ఆ పండుగల సంరంభాలూ, వేడుకలూ మాత్రం—కేవలం మతం సరిహద్దులకు పరిమితాలయినవి కావు. ఒక మతానికి చెందినవారికి మాత్రమే కాకుండా, ఇరుగు పొరుగున వున్న భిన్న మతానుయాయుల మధ్యకూడా ఆనందోత్సాహాలను కలిగించేవే నిజమైన పండుగలు !

ఇరుగు పొరుగు ప్రజల కష్టసుఖాలను పంచుకోవడంలోనే మానవ జన్మకు సార్థకత లభిస్తుంది. ఎదుటి వారికి సుఖం కలిగితే సంతోషించడం; కష్టం వస్తే సానుభూతి చూపడం—వీటిద్వారానే మనలోని మానవత్వం బయట పడుతుంది. పండుగలూ, పర్వాలూ వంటి ఆనంద సమయాలలో ఇటువంటి స్నేహాలూ, పరస్పర అభిమానాలూ మరీ స్పష్టంగా కనిపిస్తాయి. వినాయకచవితి, దీపావళి, క్రిస్మస్, సంక్రాంతి, హెూలీ, బక్రీద్, విషూ, బైసాఖి, ఓణమ్—మొదలైన పండుగలన్నీ ప్రజల మధ్య పరస్పర ప్రేమాభిమానాలు పెంచేవే. మనం మనలోని స్వల్ప భేదాలను మరచి భారతీయులందరూ ఒకటేనన్న జాతీయ సమైక్యతాభావాన్ని పెంపొందించుకుందాం !

సంపుటి 90 సెప్టెంబర్ '92 సంచిక 3

విడి ప్రతి : 4-00 : : సంవత్సర చందా : 48-00

# పాడుదాం తీయగా క్యాంప్కో పాట!

పాలు మీగడ నిండినది. కమ్మని కలలా రుచికరమైనది.

ఇది నాకు నచ్చిన చక్కని చాక్లెట్. క్యాంప్కో క్రీమీ మిల్క్ చాక్లెట్.

భారతదేశపు అతిపెద్ద అత్యాధునిక కర్మాగారం నుండి,
క్యాంప్కో లిమిటెడ్, మంగుళూరు.




R K SWAMY/BBDO CL 10117 TL

వార్తలు-విశేషాలు:

# మన నూతన రాష్ట్రపతి






ఉపరాష్ట్రపతిగా ఉన్న డా॥ శంకర్ దయాళ్ శర్మ జూలై 25 వ తేదీన మన దేశానికి తొమ్మిదవ రాష్ట్రపతిగా ఎన్నికయ్యారు. మనదేశంలోని అత్యున్నతమైన ఈ అధ్యక్ష పదవిలో ఆయన ఐదేళ్ళుంటారు.

ప్రజాప్రతినిధులైన ఉభయ పార్లమెంటు సభ్యులూ, అసెంబ్లీ సభ్యులూ కలిసి రాష్ట్రపతిని ఎన్నుకుంటారు. ఈసారి పాలకపక్షమూ, ప్రతిపక్షాలూ కలిసి రాష్ట్రపతిని ఏకగ్రీవంగా ఎన్నుకోవాలని ప్రతిపక్షాలు ప్రయత్నించాయి. కాని అది ఫలించకపోవడంతో రాష్ట్రపతి పదవికి ఎన్నికలు జరిగాయి. పాలక పక్షమైన కాంగ్రెస్ తరఫున డా॥ శంకర్ దయాళ్ శర్మ పోటీచేశారు. ప్రతిపక్షాల తరఫున వెనుకబడిన వర్గానికి చెందిన ప్రొ॥ జి.జి. స్వెల్ పోటీచేశారు. ఎన్నికలు నామమాత్రంగా జరిగాయే గాని, శంకర్ దయాళ్ శర్మకు విజయం తథ్యమని అందరూ ముందే అనుకున్నారు.

డా॥ శంకర్ దయాళ్ శర్మ 1918 వ సం॥లో భోపాల్‌లో జన్మించారు. 1939వ సం॥లో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం నుంచి, ఆంగ్లంలోనూ, న్యాయశాస్త్రంలోనూ పట్టభద్రులై స్వదేశానికి తిరిగి

వచ్చి, లక్నో విశ్వవిద్యాలయం న్యాయ శాఖలో ఉపన్యాసకులుగా చేరారు. రెండేళ్ళ తర్వాత, మళ్ళీ కేంబ్రిడ్జి విశ్వ విద్యాలయానికి ఉపన్యాసకులుగా వెళ్ళి, 'రాజ్యాంగచట్టం'లో డాక్టరేటును సాధించారు. బార్ సభ్యులయ్యారు.

భారతదేశానికి తిరిగి వచ్చి, ఆయన న్యాయవాదవృత్తిని చేపట్టారు. అయితే, అంతకు ముందే రాజకీయాలవైపు ఆకర్షించబడి భారత జాతీయ కాంగ్రెస్‌లో చేరారు. క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని అనేకసార్లు జైలు పాలయ్యారు. భోపాల్ ప్రదేశ్ కాంగ్రెస్‌కమిటీ అధ్యక్షులుగానూ, 1952 నుంచి 56 వరకు భోపాల్ రాష్ట్రానికీ, ఆ తరవాత ఏర్పడిన సువిశాల మధ్యప్రదేశ్ రాష్ట్రానికీ, ముఖ్యమంత్రి అయ్యారు.

ఆ పైన ఆయన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులుగానూ, కేంద్రంలో కాంగ్రెస్ పార్టీ ప్రధాన కార్యదర్శిగానూ బాధ్యతలు నిర్వహించారు.

1971 వ సం॥ లోక్‌సభకు ఎన్నికై, ఇందిరాగాంధి మంత్రి మండలిలో కమ్యూనికేషన్స్ శాఖ మంత్రి పదవిని చేపట్టారు. 1980 వ సం॥లో ఆయన లోక్‌సభకు మళ్ళీ ఎన్నికయ్యారు. 1984 వ సం॥ జరిగిన ఎన్నికలలో పోటీ చేయలేదు. కొంత కాలం ఆంధ్రరాష్ట్ర గవర్నర్ పదవిని నిర్వహించాక, ఆయన భారత ఉపరాష్ట్రపతిగా ఏకగ్రీవంగా ఆమోదించబడ్డారు. రాజ్యసభ కార్యకలాపాలను నిర్వహించడంలో నిష్పక్షపాత వైఖరిని ప్రదర్శించి అందరి మన్ననలూ పొందారు.

డా॥ శంకర్ దయాళ్ శర్మ ప్రధానంగా విద్యావేత్త. ఆయన అనేక గ్రంథాలు రచించారు. కొన్ని ముఖ్యమైన ప్రచురణలకు సంపాదకత్వం వహించారు. విద్యాధికులైన రాష్ట్రపతులుగా పేరొందిన డా॥ ఎస్. రాధాకృష్ణన్, డా॥ జాకీర్‌హుస్సేన్ వంటి మేధావుల వర్గానికి చెందినవారు డా॥ శంకర్ దయాళ్ శర్మ.

రాష్ట్రపతి పదవి ప్రమాణ స్వీకారం చేసిన తర్వాత, డా॥ శర్మ, "దేశప్రజల ఉజ్వలమైన భవిష్యత్తు కోసం, సేవామార్గంలో నా బాధ్యతలనూ, కర్తవ్యాలనూ సక్రమంగా నెరవేర్చడానికి శక్తి నివ్వాలని సర్వేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను," అని అన్నారు.

నూతన రాష్ట్రపతి ఆశయాలన్నీ నెరవేరాలని 'చందమామ' శుభాకాంక్షలు తెలియజేస్తున్నది.





# ఇల్లరికం

జయపురం అనే గ్రామంలో శివయ్య అనే పేదరైతు వుండేవాడు. అతని భార్య శారదమ్మ మహాసాధ్వి. వాళ్ళిద్దరికీ జయదేవుడు ఒక్కడే కొడుకు. జయదేవుడికి బాగా చదువు చెప్పించాలన్నది శివయ్య కోరిక.

జయదేవుడు చదువులో చాలా చురుకైనవాడు. అతడికి పదిహేనేళ్ళ వయసు వచ్చేసరికి, గ్రామ పాఠశాలలో వున్నంత వరకు చదువు పూర్తిచేశాడు. ఇంకా పెద్ద చదువు చదవాలంటే పట్నం వెళ్ళాలి. తమ ఆర్థిక పరిస్థితి గురించి బాగాఎరిగిన జయదేవుడు, అంతటితో చదువుమాని పొలం పనుల్లో తండ్రికి సాయపడాలనుకున్నాడు.

అయితే శివయ్య అందుకు ఒప్పుకోక, ఉన్న పొలంలో కొంత తాకట్టుపెట్టి, జయదేవుణ్ణి పైచదువులకోసం పట్నం పంపాడు. శివయ్య దంపతులు తిండికి ఇబ్బంది అయినా భరించారేగాని, జయదేవుడి చదువుకు ఏలోటూ రానీయలేదు.

నాలుగైదేళ్ళ తర్వాత జయదేవుడు చదువుపూర్తిచేసి, ఏదైనా ఉద్యోగం కోసం ప్రయత్నించాలన్న ఆలోచనలో వుండగా, అతడికి ధనరాజు అనే గొప్ప శ్రీమంతుడితో పరిచయం అయింది. ఈ ధనరాజుకు ఒక్కతే కూతురు, బాగా చదువుకున్నవాడు, బుద్ధిమంతుడైన వాడికి తన కూతురునిచ్చి పెళ్ళిచేసి, ఇల్లరికం తెచ్చుకోవాలని ధనరాజు చాలా కాలంగా ప్రయత్నిస్తున్నాడు.

ఆయన జయదేవుణ్ణి తన ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. భోజన సమయంలో తల్లివెంట వుండి వడ్డన పనుల్లో సాయపడిన దీపిక అందచందాలూ, మాట తీరూ జయదేవుణ్ణి బాగా ఆకర్షించాయి.

ఎన్. శివనాగేశ్వరరావు



భోజనాలయ్యాక ధనరాజు, జయదేవుడితో, "చూడు, జయదేవా! నాకు దీపిక ఒక్కతే కూతురు. ఏదో దేవుడి దయవల్ల లక్షలు ఆర్జించాను. దీపికే నా పంచప్రాణాలు. యోగ్యుడు, బాగా చదువు సంధ్యలున్న కుర్రవాడితో దీపిక పెళ్ళి జరిపించాలని చాలా సంబంధాలు చూశాను, అయినా ఏవీ నాకు నచ్చలేదు. నీకు సమ్మతమైతే నిన్ను అల్లుడిగా చేసుకోవాలనుకుంటున్నాను," అన్నాడు.

దానికి జయదేవుడు ఆశ్చర్యపోయి, "మీరు గొప్ప స్థితిమంతులు. నేను చాలా పేదవాడిని," అన్నాడు.

ఆ జవాబుకు ధనరాజు చిన్నగా నవ్వి, "ఆ సంగతులన్నీ నేను ముందుగానే విచారించాను. అవేవీ పెళ్ళికి అడ్డురావు. సంగతేమంటే, నువ్వు ఇల్లరికం రావలసి వుంటుంది," అన్నాడు

"ఇల్లరికమా? క్షమించండి. అది వీలుపడదు. నా తల్లిదండ్రులు ఆశలన్నీ నామీదే పెట్టుకుని చదివించారు. సాధ్యమైనంతలో వాళ్ళను సుఖపెట్టవలసిన బాధ్యత నాకు వున్నది," అన్నాడు జయదేవుడు.

"అదెవరు కాదంటారు! నీ తల్లిదండ్రులు నీతోపాటు ఇక్కడే వుంటారు," అన్నాడు ధనరాజు.

జయదేవుడు సందేహిస్తుండగా ధనరాజు, "పోనీ, నీ తల్లిదండ్రులతో నేను మాట్లాడతాను. వారు అంగీకరిస్తే, ఆపైన నీకెలాంటి అభ్యంతరం లేదుగా?" అని అడిగాడు.

ఇందుకు జయదేవుడు నమ్మతించాడు. తర్వాత ధనరాజు, జయదేవుణ్ణి వెంటబెట్టుకుని అతడి గ్రామానికి వెళ్ళి, అతడి తల్లిదండ్రులను కలుసుకుని, "మీరు పేదరైతులైనా కష్టపడి కొడుకును చదివించారు," అంటూ వాళ్ళను మెచ్చుకుని, సంగతి చెప్పి, "మీ అబ్బాయి ఇల్లరికం రావడానికి సందేహిస్తున్నాడు.

అతణ్ణి ఒప్పించండి," అని పెద్దరికంగా మాట్లాడాడు.

జయదేవుడి తల్లిదండ్రులు కొడుకుతో, "నాయనా! మేం ముసలివాళ్ళం. మా గురించి నీ భవిష్యత్తు పాడుచేసుకోకు. వీరి అమ్మాయిని పెళ్ళాడడం అన్ని విధాలా మంచిది," అన్నారు.

జయదేవుడు ఒప్పుకున్నాడు. పెళ్ళయ్యాక అల్లుడితోపాటు శివయ్య దంపతులు కూడా తన ఇంటికే వచ్చి వుండాలన్నాడు ధనరాజు. ఆయన మంచితనానికి శివయ్య, భార్య చెప్పలేనంతగా సంతోషించారు.



ఈ విధంగా దీపికతో జయదేవుడి పెళ్ళి జరిగిపోయింది. ఒక నెల గడిచాక ధనరాజు, జయదేవుడితో, "ఎంత బ్రతిమాలినా మీ అమ్మ, నాన్న ఇక్కడకు వచ్చి వుండేందుకు ఇష్టం కనబరచడం లేదు. వాళ్ళకే ఇబ్బందీ రాకుండా ప్రస్తుతానికి ఒక వెయ్యి వరహాలు పంపిస్తాను," అని దాపుల వున్న నౌకరును పిలిచి, "ఒరే, ఈ డబ్బు జాగ్రత్తగా తీసుకుపోయి, జయపురంలోని మా వియ్యంకుడికి ఇచ్చిరా!" అని వాడికి డబ్బుమూట ఇచ్చాడు.

ఇది చూసిన జయదేవుడు, మామగారి మంచితనానికి మురిసిపోయి, దీపికతో సంతోషంగా రోజులు గడపసాగాడు.

కొద్ది నెలలు గడిచాక, ఒకనాడు ధనరాజు లేని సమయంలో జయదేవుడి బాల్యస్నేహితుడు సుధాముడు వచ్చాడు. అతడు జయదేవుడి తల్లిదండ్రుల క్షేమం గురించి చెప్పి, "ఏమైనా నువ్వు ఇల్లరికం వెళ్ళి, వాళ్ళ బాగోగులు చూడ్డం మరిచావని, గ్రామంలో అందరూ చెప్పుకుంటున్నారు," అన్నాడు.

ఇది విని జయదేవుడు నొచ్చుకుని, "నేనొకసారి మన గ్రామానికి వద్దామనుకుంటున్నాను. ఆ మధ్య మామగారు నౌకరుచేత నాన్నకు వెయ్యి వరహాలు పంపాడు. దీన్నిబట్టి మామగారి మంచితనం తెలిస్తున్నది గదా!" అన్నాడు.



''వెయ్యి వరహాలా!'' అంటూ సుధాముడు ఆశ్చర్యపోయి, ''అంత పెద్ద మొత్తం ముట్టివుంటే, మీ నాన్న నాతో ఎందుకు చెప్పడు? ఇందులో ఏదో తిరకాసున్నది. సరే, వస్తాను,'' అని వెళ్ళిపోయాడు.

తర్వాత జయదేవుడూ, దీపికా ఇంటి నౌకరును ప్రశ్నించగా, వాడు ధనరాజు తన వియ్యంకుడికి ఇచ్చిరమ్మని చెప్పిన వెయ్యి వరహాలూ, తిరిగి తీసుకున్నట్టు తెలిసిపోయింది.

ఇందుకు దీపిక చాలా బాధపడుతూ, ''డబ్బు విషయంలో మా నాన్న చాలా పిసినారి. ఏం చేస్తే బాగుంటుందో, మీరే ఆలోచించండి,'' అన్నది.

ఆ మర్నాడే దీపికకు కాళ్ళూ చేతులూ బిగుసుకుపోయాయి. మంచం మీదినుంచి దిగడం కష్టం అయిపోయింది. మాట్లాడ గలగడం కూడా అంతంత మాత్రం. ధనరాజు వైద్యుణ్ణి పిలిపించాడు. ఆయన ఇచ్చిన మందులు వారం రోజులు వాడినా, దీపికలో ఏ మార్పూ రాలేదు.

కూతురు స్థితి చూసి విలవిల్లాడి పోతున్న ధనరాజుతో, జయదేవుడు, ''మామగారూ! ఇక ఈ వైద్యుడివల్లకాదు. మా గ్రామంలో సుధాముడనే గొప్ప వైద్యుడున్నాడు. ఆయన్ని పిలిపిద్దాం,'' అన్నాడు.

ఇందుకు ధనరాజు సరేనన్నాడు. సంగతి సందర్భాలు వివరిస్తూ లేఖరాసి, జయదేవుడు దాన్ని నౌకరుద్వారా సుధాముడికి పంపాడు.

సుధాముడు వచ్చి, దీపికను పరీక్షించి ఏవో మందులిచ్చి, ధనరాజుతో, ''ఈ వ్యాధి కేవలం మందులతో కుదిరేది కాదు. ముఖ్యంగా గాలి మార్పిడి అవసరం. అమ్మాయిని అత్తగారి పల్లె గ్రామానికి పంపించండి. నేనూ ఆ గ్రామం వాణ్ణే. అక్కడి చెట్టూ చేమా, పరిశుభ్రమైన గాలితోపాటు, దాపుల వున్న సేలయేటి నీరు అమ్మాయిని త్వరగా ఆరోగ్యవంతురాల్ని చేస్తుంది,'' అని చెప్పాడు.

ధనరాజు చేసేదిలేక అయిష్టంగానే అందుకు సమ్మతించాడు. ఆయనకుఏవో తీరని పనులుండడంతో, జయదేవుడు భార్యను తన గ్రామానికి తీసుకు పోయాడు. శివయ్య, శారదమ్మలు తమ ఇంటికి వచ్చిన కొడుకు, కోడల్ని చూసి పరమానందం చెందారు.

అత్తమామల ఆప్యాయత, ఆదరణల మధ్య దీపికకు, తానేదో ఇంతకాలంగా పోగొట్టుకున్న ఆనందం లభ్యమైనట్టు తోచింది. వారం రోజుల తర్వాత తనను చూడవచ్చిన తండ్రితో, అత్తవారింట తన కెంత సుఖంగా కాలం గడుస్తున్నదో చెప్పి, "నాన్నా! మనకు ఆస్తిపాస్తులకేం కొదవ లేదుకదా! నీకు ఇల్లరికపుటల్లు డెందుకు? అమ్మా, నువ్వూ ఆ గజిబిజి పట్నంవాసం వదలి, ప్రశాంతంగా వుండే ఈ గ్రామంలో హాయిగా ఎందుకు కాలం గడప కూడదు?" అని అడిగింది.

ఆ ప్రశ్నకు ధనరాజు చలించిపోయి, "అమ్మా, నీ అత్తమామలు నిన్ను కన్న బిడ్డలాగా చూసుకోవడం గమనించాను. పట్నంలో పుట్టి ఏ కష్టం లేకుండా పెరిగిన దానివి, పల్లెలో అత్తవారింట సుఖంగా కాపురం చేయలేవేమో అన్న అపోహతో, నీ భర్తను ఇల్లరికం వుండమని కోరడం జరిగింది. మనసుకు కష్టం కలిగించ వచ్చు. ఈ అన్నదేమీ మీ ఆయనతో చెప్పకు," అన్నాడు.

దానికి దీపిక అనుమానంగా, "ఇంతకూ నువ్వు నేను చెప్పినట్టు ఇక్కడికొచ్చి స్థిరపడిపోవడానికి ఇష్టపడినట్లేనా?" అని అడిగింది.

"కాకేమిటి? ఈ దాపుల్లోనే, నేనూ, మీ అమ్మా కాస్త విశాలంగా వుండే ఇల్లు కట్టుకుంటాం. మా శేషజీవితాన్ని, నీ అత్తా, మామలతోపాటు ఇక్కడే హాయిగా గడిపేస్తాం!" అన్నాడు ధనరాజు సంతోషంగా.

ఈ సంగతి విని జయదేవుడితోపాటు, అతడి తల్లిదండ్రులు కూడా చాలా ఆనందపడ్డారు.



# ముత్తాత!

రాజుగారి సైన్యంలో చాలాకాలం పనిచేసి, వయసు మళ్ళాక ఉపకార వేతనంతో ఇంట హాయిగా కాలక్షేపం చేస్తున్న జయసింహుడనే అతను, ఒకసారి రాజధానికి వెళ్ళాడు. అక్కడ అతడికి పురాతన వస్తువులమ్మే దుకాణం ఒకటి కనిపించింది. అందులో, మెలితిరిగిన పెద్ద మీసాలతో డాలూ, కత్తీ పట్టుకుని ఠీవిగా నిలబడిన ఒక మధ్యవయస్కుడి తైలవర్ణ చిత్రం జయసింహుణ్ణి బాగా ఆకర్షించింది.

ఇది గమనించిన దుకాణదారు, "అయ్యా, అది ఐదారు వందల ఏళ్ళనాటి ఒకానొక మహా వీరుడి చిత్రం. పేరు తెలియదు కాని—ఆయన యుద్ధంలో కనీసం నూటొక్కమంది శత్రువుల్ని హతమార్చితేగాని కత్తి ఒరలో పెట్టేవాడు కాదట! మీరు ముచ్చటపడుతున్నారు గనక, నూరు వరహాలకిస్తాను, తీసుకుపొండి. బేరం మాత్రం ఆడకండి," అన్నాడు.

జయసింహుడు తన దగ్గిరున్న డబ్బు లెక్కపెట్టి చూస్తే, తొంభై వరహాలు మాత్రమే వున్నవి. చేసేదిలేక అతడు దుకాణం నుంచి బయటకు వచ్చాడు.

నెలరోజుల తర్వాత జయసింహుడు, తనలాగే సైన్యంలో పనిచేసి, ఉపకార వేతనంతో జీవిస్తున్న ఖడ్గసింహుడి ఇంటికి వెళ్ళాడు. అక్కడ అతనికి తను దుకాణంలో చూసిన సైనికుడి తైలవర్ణచిత్రం గోడకు వేళ్ళాడుతూ కనిపించి ఆశ్చర్యపోయాడు.

అది గమనించిన ఖడ్గసింహుడు మీసం సరిదిద్దుకుంటూ, "ఆశ్చర్యంగా వుందా? ఆయనెవరో కాదు, మా ముత్తాత! అలనాడు జరిగిన రుద్రపురి యుద్ధంలో ప్రళయ భయంకరంగా పోరాడి, వీరస్వర్గం చెందాడు," అన్నాడు.

జయసింహుడు నిట్టూర్చి, "పది వరహాలు తగ్గినై. లేకపోతే ఆయన మా ముత్తాత అయి వుండేవాడు!" అన్నాడు.

—కోనే నాగవెంకట ఆంజనేయులు





# మాయా భవనం

## 6

[వీరగిరి యువరాణి విద్యావతిని సారసనరోవర విడిదిభవనం నుంచి, ఎవరో అరణ్య మధ్యంలోని మాయాభవనానికి రహస్యంగా తరలించారు. యువరాణిని వెతకడానికి, మహేంద్ర నాథుడనే యువకుడు రాజు వీరసేనుడి అనుమతి పొంది బయలుదేరాడు. అక్కడ మాయా భవనంలో యువరాణి విద్యావతికి అంతా చాలా విచిత్రంగా కనిపించింది. —తరవాత]

మాయాభవనంలో వృద్ధ పరిచారిక కమల పోలికలతో వున్న స్త్రీ చెప్పిన విధంగా, యువరాణి విద్యావతి ఒక తల్పం మీద పడుకుని కళ్ళు మూసుకున్నది. కాని ఆమెకు ఎంతకూ నిద్ర పట్టలేదు. తన తండ్రి హఠాత్తుగా వ్యాధిగ్రస్తుడయ్యాడని తనతో చెప్పి మోసంతో తనను ఇక్కడికి తీసుకు వచ్చిన దుర్మార్గులు ఎవరై వుంటారు? తన తండ్రికి శత్రువులై వుంటారా? ప్రజలను కన్న బిడ్డల్లా పాలిస్తూ, ఇరుగు పొరుగు రాజ్యాలతో చక్కటి స్నేహసంబంధాలు కలిగి, అజాతశత్రువుగా పేరుగాంచిన తనతండ్రికి శత్రువులు ఎవరు? ఈ విపత్కర పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కొని ఎలాగైనా ఈ మాయా భవనం నుంచి బయటపడి తల్లిదండ్రులను కలుసుకోవాలి, అని ఆలోచిస్తూ ఆమె తెల్లవారుజామున నిద్రపోయింది.



విద్యావతి లోపలికి వెళ్ళి స్నానం చేసి, తనకోసం అక్కడ చక్కగా మడతబెట్టి వుంచిన దుస్తులు ధరించి వెలుపలికి వచ్చింది. అక్కడ ఇద్దరు పరిచారికలు తన దుస్తుల వంటివే ధరించి వుండడం చూసి ఆమె అమితాశ్చర్యం చెందింది.

వృద్ధస్త్రీ, విద్యావతికి వాళ్ళను చూపుతూ, ''వీళ్ళు నీ అవసరాలు సమకూర్చడానికి వచ్చిన నీల, మాల అనే పరిచారికలు. నీకు ఏం కావాలన్నా వీళ్ళను అడగవచ్చు.'' అన్నది.

''నువ్వూ ఇక్కడే వుంటావుకదా?'' అని అడిగింది విద్యావతి.

''ఆఁ... ఉంటాను; లేదు. అది వేరే విషయం. నీకది అనవసరం. ఇక్కడ ఒక ముఖ్యమైన విషయం గుర్తుంచుకో. నువ్వు నన్ను గాని, ఇతర పరిచారికలను గాని ఎటువంటి ప్రశ్నలూ అడగకూడదు. తెలిసిందా?'' అని హెచ్చరించి ఆ స్త్రీ వేగంగా వెలుపలికి వెళ్ళిపోయింది.

ఉదయం భోజనం చేశాక యువరాణి విద్యావతి ఆ విశాలమైన గదిలోని ఒక కిటికీ సమీపంలో వున్న ఆసనంలో కూర్చున్నది. గది గోడలకు అడుగు నుంచి, పై కప్పు వరకు కొంచెం కూడా ఖాళీలేకుండా నిలువుటద్దాలు అమర్చబడి ఉన్నాయి.

పరిచారిక కమల పోలికలతో వున్న వృద్ధస్త్రీ మెల్లగా తట్టి లేపడంతో యువరాణి కళ్ళు తెరిచి చుట్టుపక్కల కలయ చూసింది. గదిలోకి నీరెండ పడుతున్నది. తెల్లవారి చాలా సేపయిందని ఆమె గ్రహించింది.

''బాగా నిద్రపోయినట్టున్నావు?'' అని అడిగింది వృద్ధస్త్రీ.

అవును అన్నట్టు తల ఊపి, లేచి కూర్చుంటూ, ''స్నానం చేయాలి,'' అన్నది విద్యావతి.

''అంతా సిద్ధంగా ఉన్నది,'' అంటూ దాపులనున్న స్నానం గదిని చూపించింది వృద్ధస్త్రీ.



చెప్పకముందే లేచి వెళ్ళి పరుపు మీద పడుకున్నది. ఒక పరిచారిక ఆమె దగ్గర నిలబడి మెల్లగా వింజామర వీవసాగింది. అలా సాయంకాలం వరకూ ఇద్దరు పరిచారికలలో ఎవరో ఒకరు ఆమె వెంట ఉంటూనే ఉన్నారు. సాయంకాలానికి "యువరాణీ! ఉద్యానవనంలో విహారానికి వెళదాం, రా," అంటూ వృద్ధస్త్రీ అక్కడికి వచ్చింది.

విద్యావతి నెమ్మదిగా లేచి మౌనంగా ఆ స్త్రీ వెంట నడిచి ఉద్యానవనం చేరింది. అడవి నుంచి ఉద్యానవనం మీదుగా వీస్తున్న గాలి యువరాణికి ఎంతో హాయిని కలిగించింది. ఆమె వెనకగా కొంతసేపు నడిచిన వృద్ధ స్త్రీ ఒకచోట కూర్చుని ఆమెనే గమనించసాగింది. విద్యావతి ఉద్యానవనంలో రకరకాల పువ్వులనూ చెట్లనూ చూస్తూ, కంబళి పరిచినట్టున్న పచ్చటి గడ్డిమీద చాలాసేపు నడిచింది. చీకటి పడుతూండగా ఇద్దరూ మళ్ళీ మాయాభవనం చేరారు.

భవనంలో ప్రవేశించి కొంత దూరం ముందుకు వెళ్ళాక విద్యావతికి కిందటి రాత్రి పడుకున్న శయనగృహాన్ని దాటి వచ్చేశామా అనిపించింది. వృద్ధస్త్రీ పక్కన వున్న తలుపు తెరిచింది. ఎదురుగుండా విశాలమైన గది కనిపించింది. కాని

రెండు పెద్ద కిటికీలగుండా బయట వున్న ఉద్యానవనం అందంగా కనిపిస్తున్నది. పరిచారిక లిద్దరూ గదిలోని వస్తువులనూ, తెరలనూ చక్కగా సర్దడం ప్రారంభించారు. వాళ్ళు గదిలో ఒకవైపునుంచి మరొక వైపుకు వెళుతూ వుంటే అద్దంలో వాళ్ళ ప్రతిబింబాలు రకరకాలుగా కనిపించసాగాయి. పరిచారికల వేషధారణ మాత్రమే కాదు, రూపురేఖలు కూడా తన లాగే వుండడం గమనించి యువరాణి ఆశ్చర్యం చెందింది.

మధ్యాన్నానికి ఒక పరిచారిక యువరాణికి భోజనం తెచ్చిపెట్టింది. యువరాణి మౌనంగా భోజనం ముగించి, వాళ్ళు

అక్కడి తెరలు వేరొక రంగులో వుండడం విద్యావతి గమనించింది. భోజనం ముగించి, ఆమె అక్కడే పడుకుని ఆ రాత్రి హాయిగా నిద్రపోయింది.

మర్నాడు తెల్లవారగానే లేచి, ఆమె కిటికీ గుండా వెలుపలికి చూసింది. ఆమెకు ఉద్యానవనంలో వేరొక భాగం కనిపించింది. ఉద్యానవనంలోని మొక్కలూ, పువ్వులూ, నిన్నటివిలాగా లేవు. విద్యావతి లేచి స్నానానికి వెళ్ళింది. మొదటిరోజు లాగానే, ఆమెకు కావలసిన దుస్తులు అక్కడ మడతబెట్టి ఉన్నాయి. స్నానం ముగించుకుని వెలుపలికి రాగానే, అక్కడ వృద్ధస్త్రీ మరి ఇద్దరు పరిచారికలు కనిపించారు. ఆ ఇద్దరు పరిచారికలు కూడా, యువరాణి ధరించిన దుస్తులనే ధరించి వున్నారు. వాళ్ళు కవలలుగా కనిపించడమే కాదు, వాళ్ళలో తన పోలికలు కూడా కొంత ఉండడం విద్యావతి పసిగట్టింది.

"వీరి పేర్లు సురేఖ, సులేఖ. ఈరోజు వీళ్ళే నీకు కావలసిన అవసరాలు సమకూర్చగలరు!" అనిచెప్పి వృద్ధస్త్రీ అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

తన దగ్గిరికి వచ్చిన ఒక పరిచారికతో విద్యావతి, "సురేఖా! నిన్నొక విషయం అడగనా?" అన్నది.




"నేను సులేఖను, యువరాణీ! ఏదైనా పానీయం తీసుకు రమ్మంటారా?" అన్నదా పరిచారిక.

"ఏదీ వద్దు. నువ్వు ఇక్కడ చాలా కాలంగా వుంటున్నావా?" అని అడిగింది విద్యావతి సూటిగా.

"లేదు, యువరాణీ! ఇక్కడకు వచ్చి రెండు నెలలు కూడా కాలేదు!" అన్నది సులేఖ.

"అలాగా, మరి అంతకు పూర్వం ఎక్కడ వుండేదానివి?" అని అడిగింది విద్యావతి.

"ఇంటి దగ్గరే, యువరాణీ!" అన్నది సులేఖ.




మధ్యాన్నం భోజనం చేసి, విద్యావతి కునుకు తీయడానికి తల్పం మీదికి చేరి, దూరంలో నిలబడి వున్న పరిచారికను చూసి, "సులేఖా! ఇలా వచ్చి నాపక్కన కూర్చో, నిన్నొక విషయం అడగాలి!" అన్నది.

"యువరాణీ! నేను సురేఖను," అంటూ దగ్గిరికి వచ్చిందా పరిచారిక.

"అలాగా! మీరిద్దరూ ఒకేలాగా వుండడం వల్ల, మీ పేర్లు తారుమారవుతున్నాయి. ఇంతకూ, మీరిద్దరూ కవలలే కదా?" అని అడిగింది విద్యావతి.

"కాదు యువరాణీ! అసలు మేము తోబుట్టువులం కూడా కాదు," అన్నది సురేఖ.

"మీరెంత కాలంగా ఇక్కడ ఉంటున్నారు?" అని అడిగింది విద్యావతి.

"ఒకటి రెండు నెలలుగా!" అన్నది సురేఖ.

"ఇంత పెద్ద భవనంలో మీ రిద్దరే ఉంటున్నారా?" అని అడిగింది విద్యావతి ఆశ్చర్యంగా.

"నిన్న మీకు పరిచర్యలు చేయడానికి నీల, మాల వచ్చారు. ఈ రోజు మేము వచ్చాము. రేపు, ఎల్లుండి, ఆ తరవాత వేరెవరో వస్తారు. మాలాగే ఇక్కడ ఇంకా కొందరు పరిచారికలు ఉన్నారు గాని,

"నువ్వంటే నాకు చాలా ఇష్టం. నేను నా భవనానికి తిరిగి వెళ్ళేప్పుడు నాతో పాటు వస్తావా?" అని అడిగింది విద్యావతి.

"ఇది కూడా మీ భవనమే యువరాణీ! యజమాని కోరినంత కాలం మీరిక్కడే ఉంటారు. ఆ తరవాత ఆయన మిమ్మల్ని తీసుకు వెళ్ళవచ్చు. అయితే, అది ఎప్పుడు ఎక్కడికి అన్న విషయాలు మాత్రం నాకు తెలియదు!" అన్నది సులేఖ.

"అలాగా!" అని అంతటితో ఊరుకున్నది విద్యావతి. ఆ తరవాత ఒకరితో ఒకరు ఏమీ మాట్లాడుకోలేదు.

వాళ్ళందరినీ నేను చూడలేదు. వాళ్ళ పేర్లు కూడా నాకు తెలియదు,'' అన్నది సురేఖ.

''మరి ఇక్కడ పురుషు లెవరూ లేరా? మీ యజమాని ఉన్నాడు కదా?'' అని అడిగింది విద్యావతి.

''ఉన్నారు గాని, పురుషులు దూరంగా విడిగా ఉంటారు. మా చాయలకు రారు. యజమాని ఎప్పుడోగాని రాడు. ఇంత వరకు నేను మా యజమానిని చూడ లేదు. సరే, యువరాణీ మీ నిద్రకు వేళయింది,'' అంటూ సురేఖ, విద్యావతి పడకను సిద్ధం చేసి, ఆమె పడుకోగానే పైన పట్టు వస్త్రం కప్పి, దూరంగా వెళ్ళి కిటికీ దగ్గరున్న చిన్న ఆసనంలో కూర్చున్నది.

సాయంత్రం విద్యావతి నిద్ర లేచేసరికి, ఆమెను విహారానికి తీసుకు వెళ్ళడానికి వృద్ధస్త్రీ అక్కడ సిద్ధంగా ఉన్నది. తను విహారానికి వెళ్ళేటప్పుడు వృద్ధస్త్రీ తప్ప మరొకరు రావడంలేదు. వృద్ధస్త్రీ కూడా తనతో తూచి తూచి మాట్లాడుతుందే తప్ప అవసరానికి మించి ఒక్కముక్క మాట్లా డడం లేదు. వీళ్ళందరినీ శాసిస్తున్నది ఎవరా అని ఆలోచిస్తూ విద్యావతి, వృద్ధ స్త్రీతోపాటు కొంతసేపు ఉద్యానవనంలో నడవసాగింది. చీకటి పడగానే ఇద్దరూ మాయాభవనంలోకి వచ్చారు. వృద్ధస్త్రీ తనను ఇప్పుడు వేరొక గదిలోకి తీసుకు వెళ్ళినట్టు విద్యావతి స్పష్టంగా గ్రహిం చింది.

మరునాడు ఆమె నిద్ర లేచేసరికి, మాలిని, శాలిని అనే ఇద్దరు పరిచారికలు వచ్చారు. వాళ్ళూ తాను ధరించిన దుస్తులే ధరించి ఒకేపోలికలతో ఉన్నారు. తనను ఇక్కడికి అపహరించుకుని వచ్చిన దుర్మార్గులు తనను ఇతరులు గుర్తు పట్టకుండా ఉండడానికి కావలసిన ఏర్పా ట్లన్నీ ముందే జాగ్రత్తగా చేసి వుంచారని విద్యావతి గ్రహించి, దీనికి తరుణోపాయం ఏమిటా అని తీవ్రంగా ఆలోచించ సాగింది. —(ఇంకావుంది)



# దూరపు కొండలు !

లచ్చిశెట్టి పచారీకొట్టు పెట్టుకుని, వ్యాపారం చేసుకుంటున్న చిల్లర వర్తకుడు. అతడికి మోటుపల్లి రేవునుంచి తూర్పుదీవులకు వెళ్ళి వ్యాపారం చేస్తే, కోట్లకు పడగలెత్తవచ్చునని ఎవరో బాగా నూరిపోశారు. అయితే, తల్లిదండ్రులు, భార్యా దూరపుకొండలు ఎప్పుడూ నున్నగానే కనబడతాయనీ, వ్యాపారదక్షత వుండాలే కాని, ధనం సంపాదించడానికి అలా దేశాలుపట్టి పోనక్కరలేదనీ ఎంతగానో చెప్పి చూశారు. కాని లచ్చిశెట్టి మాత్రం వాళ్ళ మాటలు పట్టించుకోక, తూర్పు దీవులకు వెళ్ళడానికి సన్నాహాలు ప్రారంభించాడు.

ఇలా వుండగా, ధనం సంపాయించడానికి తూర్పు దీవులకు వెళ్ళి తిరిగి వచ్చిన, లచ్చిశెట్టి బంధువొకాయన అతడి ఇంటికి వచ్చాడు.

లచ్చిశెట్టి ఆ దీవుల విశేషాలు బంధువును అడిగి తెలుసుకుంటూ, "అక్కడ రత్నాలు రాసులుపోసి వీధుల్లో అమ్ముతారట, నిజమేనా?" అని అడిగాడు.

శెట్టి బంధువు వినుక్కుంటూ, "అసలక్కడ రత్నాలే లేవు! గొప్పగా వుంటుందని పాలరాతితో చేసిన తూకంరాళ్ళు తీసుకుపోయాను. వాళ్ళు నా దగ్గిర వున్న రకరకాల వస్తువుల మీద ఏమాత్రం ఆసక్తిచూపకపోగా, తూకంరాళ్ళు గోలుకొండ రత్నాలని భ్రమపడి ఎత్తుకుపోయారు. మనదేశానికి చెందినదయితే, అది ఎలాంటి రాయి అయినా తప్పక ఏదో వజ్రం కాకుండా వుండబోదని, ఆ దీవులవాళ్ళు గట్టిగా నమ్ముతారని, నాకప్పుడే తెలిసింది," అన్నాడు.

బంధువు అలా చెప్పగానే లచ్చిశెట్టికి కూడా దూరపుకొండలు నున్నగా వుంటాయని, ఎందుకంటారో తెలిసివచ్చింది.

—సాయిరాం ప్రసాద్






# సత్యపాలుడికథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, అర్ధరాత్రి వేళ భీతిగొలిపే శ్మశానంలో నువ్వు ప్రదర్శిస్తున్న పట్టుదలా, శ్రమకు ఓర్చుకోగల శక్తీ చూస్తుంటే, నాకు ఆశ్చర్యం కలుగుతున్నది. దేశపాలకులైన రాజుల్లో ఇలాంటి గుణగణాలు సర్వసాధారణం కాకపోయినా, అపూర్వం మాత్రం కాదు. దేశాన్ని సమర్థవంతంగా పాలించి, ప్రశాంత వాతావరణంలో దాన్ని వారసుల పరం చేయాలంటే, అందుకు కేవలం పట్టుదలా, ధైర్య సాహసాలూ మాత్రమే చాలవు—ఎంతో నిలకడ గల రాజనీతి, చతురత అవసరం. రాజుకు కావలసిన అన్ని మంచి లక్షణాలూ వుండి,

## బేతాళ కథలు



నిలకడగల రాజనీతి చతురత లోపించిన సత్యపాలుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం చందనదేశాన్ని పాలించే చంద్రపాలుడు హఠాత్తుగా మరణించడంతో, ఆయన ఏకైక పుత్రుడు సత్యపాలుడు రాజయ్యాడు. రాజైన కొద్ది రోజుల్లోనే, అతడు దేశపు యధార్ధ స్థితిగతుల్ని గమనించి ఖిన్నుడయ్యాడు. భోగ లాలసుడైన చంద్రపాలుడు, పరిపాలన చాలావరకు ఉన్నతాధికారుల చేతుల్లో వదిలేసి, విలాస జీవితం సాగించాడు. అవకాశం అవినీతిని సృష్టిస్తుందన్న దానికి సాక్ష్యంగా, అధికారుల్లో లంచగొండితనం, మోసబుద్ధీ ప్రబలినాయి.

దేశపు ఆంతరంగిక పరిస్థితులు ఇలా వుండగా, విదేశాల నుంచి కూడా చందన దేశానికి సమస్యలు ఎదురు కాసాగాయి. చందనకు తూర్పు దిక్కున, చందన దేశాన్ని ఆనుకుని ఒక భిల్లదేశం వున్నది. తరతరాలుగా అది చందనకు సామంత దేశం. ఆ దేశాన్ని ప్రస్తుతం పాలిస్తున్న జయసేనుడు, స్వతంత్రం కోసం ప్రయత్నిస్తున్నాడని వేగులు వార్త తీసుకు వచ్చారు. ఇక, తూర్పుదిక్కున భిల్లదేశాన్ని ఆనుకుని మిహిరదేశం వున్నది. మిహిరను పాలిస్తున్న ప్రచండవర్మ, చందనదేశం లోని అరాజక పరిస్థితులను అవకాశంగా తీసుకుని, దేశాన్ని కబళించాలనే ఆలోచనలో వున్నట్టు ఆ వేగులే నమ్మకమైన వార్తలు తెచ్చారు.

ఇన్ని చిక్కుముడుల మధ్య సింహాసనాన్ని అధిష్ఠించిన సత్యపాలుడు, ఒక నాడు మహామంత్రి కేవలభట్టుతో మంత్రాంగం సాగించబోయాడు.

''మహారాజా! ఆంతరంగిక సమస్యల కంటే, విదేశీ సమస్యలకే మనం అధిక ప్రాధాన్యత ఇవ్వాలి. అలా కానప్పుడు మనకు రాజ్యమే మిగలదు. ఉన్న సమస్యలన్నీ చిటికెలో పరిష్కారమవా

లంటే, ఒకేఒక్క ఉపాయం వున్నది!'' అన్నాడు కేవలభట్టు.

''ఏమిటది?'' అన్నాడు సత్యపాలుడు కుతూహలంగా.

''మిహిరాధీశుడికి ఒక్క ఆడపిల్ల మాత్రమే సంతానం. ఆమెను మీరు వివాహమాడినట్లయితే, చిక్కులన్నీ ఇట్టే విడిపోతాయి. పెరిగిన మన బలం చూసి భిల్ల జయసేనుడు స్వతంత్రించ డానికి సాహసించడు సరికదా, అవసరం అనుకుంటే మనమే అతణ్ణి మట్టుబెట్టి, ఆ దేశాన్నికూడా మన రాజ్యంలో కలుపు కోగలం!'' అన్నాడు కేవలభట్టు.

సత్యపాలుడు ఆశ్చర్యంగా, ''అదెలా సాధ్యం, మహాత్మా? ప్రచండవర్మ వియ్యపుటాలోచనలోనే వుంటే, అసలు యుద్ధప్రసక్తే వుండదు కదా?'' అన్నాడు.

కేవలభట్టు క్షణం సంకోచించి, ''ఆయనలో ఆ ఆలోచన లేని మాట నిజమే, మహారాజా! కాని రాకుమార్తె మధూలిక ఆలోచన మాత్రం అదేనని, మన వేగులు చెప్పారు. మనకు కూడా అదే ఆలోచన వున్నట్టు అదే వేగులద్వారా ఆమెకు తెలియజేస్తేచాలు! అటునుంచి ఆమే నరుక్కొస్తుంది.'' అన్నాడు.

సత్యపాలుడు ఒక్కక్షణం మౌనం వహించి, చిరునవ్వుతో, ''మధూలిక ఆలో



చనల గురించి మీకు చెప్పిన వేగులు, ఆమె అహంకారం గురించి చెప్పలేదా?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు మంత్రి కేవలభట్టు తడ బడి, ''ఆమాట నిజమే మహారాజా! కాని ఆమె ఇంకా చిన్నపిల్లేగదా,'' అన్నాడు.

ఆ జవాబుకు సత్యపాలుడు చిరునవ్వు నవ్వి, అంతటితో మంత్రాంగం ముగించాడు.

తనను చుట్టుముట్టుతున్న సమస్యలకు పరిష్కారమార్గం ఏమిటా అని ఆలోచిస్తూ, వికలమైన మనస్సుతో, ఒకనాడు సత్య పాలుడు, కాంచనగిరి పాదంవద్ద ఆశ్రమ వాసం చేస్తున్న తన గురువును కలుసు



కునేందుకు, ఒంటరిగా గుర్రం మీద బయలుదేరాడు.

గురుకులాశ్రమం ఇక కొద్ది దూరంలో వున్నదనగా, చిరుతపులి ఒకటి పొదల చాటునుంచి భీకరంగా గాండ్రిస్తూ, సత్యపాలుడి గుర్రం మీదికి దూకింది. గుర్రం బెదిరి, సత్యపాలుడు ఎంత అపుచెయ్యబోయినా ఆగక, వాయువేగంతో పరిగెత్త సాగింది. అలా కొంతసేపు పరిగెత్తిన పిమ్మట, సమీపం నుంచి ఒక చిత్రమైన ధ్వని వినిపించింది. ఆ ధ్వని వింటూనే గుర్రం శాంతించి, ఒక చెట్టుదగ్గిర ఆగింది.

సత్యపాలుడు ఆ ధ్వనిని గుర్తుపట్టాడు. రెచ్చిపోయిన గుర్రాలను అదుపు చెయ్యడం కోసం, నేర్పరులైన భిల్లులు నోటితో చేసే విచిత్ర ధ్వని అది! ఆ సంగతి గ్రహించగానే, తాను భిల్లరాజ్యపు పొలిమేరల్లో ప్రవేశించానని గ్రహించిన సత్యపాలుడు, పరిసరాలను గమనిస్తూ, నెమ్మదిగా గుర్రం దిగాడు.

ఇంతలో చెట్ల చాటునుంచి, భుజాన విల్లూ, బాణాలూ ధరించిన నూనూగు మీసాల భిల్ల యువకుడొకడు చిరునవ్వుతో సత్యపాలుణ్ణి సమీపించాడు. సత్యపాలుడు అతణ్ణి పరిశీలనగా చూస్తూ, "నోటితో ధ్వని చేసి గుర్రాన్ని అదుపు చేసింది నువ్వేనా?" అని ప్రశ్నించాడు.

ఆ యువకుడు అవునన్నట్టు తలవూపి, బొంగురు గొంతుతో, "మీరు చాలా అలసిపోయి వుంటారు! కొద్దిసేపు అలా విశ్రమించండి, ఇప్పుడే వస్తాను!" అంటూ వెనుదిరిగి చెట్లమధ్యకు వెళ్ళాడు.

ఆ యువకుడి విలక్షణమైన స్వరూపానికీ, బొంగురుగా ధ్వనిస్తున్న అతడి కంఠస్వరానికీ ఆశ్చర్యపోయిన సత్యపాలుడు, ఏదో అనుమానం కలగగా చిరునవ్వు నవ్వుకుంటూ, ఒక చెట్టు కింద కూర్చున్నాడు. కొద్దిసేపట్లో ఆ యువకుడు, ఒక చేతిలో కొన్ని మధుర ఫలాలూ, మరొక చేతిలో ఒక తాబేటికాయలో నీళ్ళు తీసుకు వచ్చి, సత్యపాలుడికి అందించాడు.



సత్యపాలుడు అవి అందుకుంటూ, "నన్ను గుర్తుపట్టి నువ్వు చేస్తున్న, ఈ పనులకు చాలా సంతోషం. నాతోబాటు వచ్చావంటే, నా ఆస్థానంలో మంచి పదవి ఇచ్చి ఋణం తీర్చుకుంటాను," అన్నాడు.

ఆ యువకుడు చిన్నగా నవ్వి, "నేను నా విధి నెరవేర్చాను, అంతే! అందుకు గాను ఏ ప్రతిఫలమూ అవసరం లేదు, వస్తాను!" అంటూ వెళ్ళబోయాడు.

వెంటనే సత్యపాలుడు కోపంగా, "నేను సార్వభౌముణ్ణనీ, మీది సామంత దేశమనీ తెలిసీ, ఈ మాటలు మాట్లాడు తున్నావా?" అని ప్రశ్నించాడు.

యువకుడు ఆగి, "నన్ను జయసేనుడి కుమార్తె కీర్తిసేనగా గుర్తుపట్టారని, నాకు తెలుసు! నన్ను రెచ్చగొట్టి పరీక్షించాలనే, అలా అహంకారపూరితంగా మాట్లాడారు," అన్నది కీర్తిసేన.

ఆ మాటలకు సత్యపాలుడు నవ్వుతూ, "అర్థమైంది, కీర్తిసేనా! బొంగురు గొంతు నీకూ, అహంకారం నాకూ స్వభావాలం కారాలుగా రాణించలేదు," అంటూ లేచి నిలబడి, "ఇక వెళ్ళివస్తాను!" అన్నాడు.

కీర్తిసేన ఒక్క క్షణం తటపటా యించి, "కొంచెం ఆగండి. ఇలా నా వెంట రండి," అంటూ ముందుకు దారితీసింది.

ఇద్దరూ కొద్దిసేపు నడిచి, బాగా చదును చేసివున్న ఒక ప్రదేశానికి చేరు కున్నారు. అక్కడ, నల్లరాతితో చేసిన ఆరడుగుల శక్తివిగ్రహం ఒకటి వున్నది.

కీర్తిసేన సత్యపాలుడితో, "ఈమెను స్వయంశక్తి దేవతగా మేం ఆరాధిస్తాం. ఈ దేవత ఆశీర్వాదం వుంటే, అన్ని చిక్కులూ విడిపోతాయని, మా దృఢ విశ్వాసం!" అన్నది.

సత్యపాలుడు, స్వయంశక్తి దేవతకు భక్తిగా నమస్కరించి, రెండు మాసాల తర్వాత, ఇదే రోజున అక్కడే కలుసు కుంటానని చెప్పి, రాజధానికి ప్రయాణ మయ్యాడు.



ఆ మర్నాటి నుంచే, అతడి అజ్ఞ ప్రకారం లంచగొండులుగా పేరు బడ్డ ఉన్నతాధికారులు బంధింప బడ్డారు. సత్యపాలుడి నాయకత్వంలో సైనికులు జట్లుజట్లుగా చీలి దేశంలోని అన్ని రకాల దొంగలనూ బంధించి కారాగారంలో వేశారు.

ఇలా రెండు మాసాలు గడిచాయి. సత్యపాలుడు ముందు చెప్పినట్టే, భిల్లదేశపు పొలిమేరల్లో పురుష వేషంలో వున్న కీర్తిసేనను కలుసుకున్నాడు.

అతడు, ఆమెతో, ''కీర్తిసేనా! స్వయం శక్తి దేవత దయవల్ల నా చిక్కులన్నీ విడిపోయాయి. నాకు ఇంత మహోపకారం చేసిన నీకు ఎంతయినా ఋణపడి వున్నాను. నాతోబాటు మా రాజ్యానికి వచ్చి, మహారాణి పదవిని అలంకరించి, నన్ను కాస్త అయినా ఋణవిముక్తుణ్ణి చెయ్యమని కోరుతున్నాను,'' అన్నాడు.

కీర్తిసేన బదులు చెప్పక తల వంచుకున్నది. ఆ తర్వాత కొద్ది రోజుల్లోనే, కీర్తిసేన అన్న వీరసేనుడు, అనేకమైన కానుకలతో సత్యపాలుణ్ణి కలుసుకుని, తన చెల్లెలిని వివాహమాడవలసిందిగా కోరాడు. సత్యపాలుడు అంగీకరించాడు.

మరి కొద్ది రోజుల్లోనే కీర్తిసేనా, సత్యపాలుర వివాహం జరిగిపోయింది.

వివాహ సంరంభం ముగిసీ ముగియడంతోనే, మామగారి సైన్యాన్ని కూడా వెంటబెట్టుకుని, మిహిరదేశం మీదికి దండెత్తాడు, సత్యపాలుడు.

యుద్ధంలో ప్రచండవర్మ చిత్తుగా ఓడిపోయి, సత్యపాలుణ్ణి కలుసుకుని, ''నాయనా సత్యపాలా! పోయినే రాజ్యం మీద నాకు ఆశ లేదు. కాని, నాకున్న ఒక్కగానొక్క కుమార్తె మధూలిక, నీ మీద అభిమానం పెంచుకున్నది. ఆమెను నీ రాణిగా స్వీకరించమని వేడుకుంటున్నాను,'' అంటూ దీనంగా కోరాడు.

ఇందుకు సత్యపాలుడు అంగీకరించి, మధూలికను వివాహం చేసుకున్నాడు.

తర్వాత ప్రచండవర్మను తనకు సామంత రాజుగా నియమించి, కీర్తిసేనా మధూలికలతో చందనదేశానికి తిరిగివెళ్ళాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, తండ్రి భోగలాలసత కారణంగా, అరాజక స్థితిలో వున్న దేశాన్ని ఛిన్నాభిన్నం కాకుండా సత్యపాలుడు కాపాడిన మాట నిజం. ఇందుకు రాజనీతి, చతురత అవసరంలేదు. పట్టుదలా, కార్యదీక్షా వుంటే చాలు. పరరాజుల పట్ల ప్రవర్తించే తీరులోనే ఒక నిలకడ గల రాజనీతి చతురత అవసరం అవుతుంది. అలాటిది సత్యపాలుడిలో వున్నట్టు లేదు. చంద్రపాలుడి భోగలాలసత, వారసుడైన సత్యపాలుడికి గడ్డుసమస్యలు కల్పించినట్టుగానే, సత్యపాలుడి రాజనీతి లోపం, అతడి వారసుడికి ప్రమాదకారణం కావచ్చు. అతడి నిలకడలేని స్వభావానికి ఉదాహరణ, మధూలిక విషయంలో అతడు ప్రవర్తించిన తీరు. తనకు తానై మధూలికను పెళ్ళిచేసుకుంటానని చెప్పి దానికి నిరాకరించినవాడు, కీర్తిసేన విషయంలో మరొక విధంగా ప్రవర్తించాడు. పోనీ మధూలిక అహంకారి అని తిరస్కరించాడా అంటే, ఆమెనూ చేపట్టాడు. ఇదంతా చూస్తూంటే—తండ్రి ఒక కారణంగా రాజ్యపాలనకు అనర్హుడైతే, సత్యపాలుడు మరొక కారణంగా అనర్హుడుగా కనిపించడం లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సత్యపాలుడు అన్ని విధాలా రాజ్యపాలనకు అర్హుడన్న సంగతి, అతడు అధికారానికి వచ్చినప్పటినుంచీ ప్రవర్తించిన తీరును బట్టి మనం నిర్ణయించవచ్చు. అంతరంగిక సమస్యలకంటే, పొరుగు రాజులు సృష్టించే సమస్యలకే అధిక ప్రాధాన్యం ఇవ్వాలన్న మంత్రి కేవలభట్టు సలహాను తోసిపుచ్చడంలోనే, అతడి రాజనీతి చతురత వెల్లడవుతున్నది. ప్రజాభి

మానం రాజుకు లక్షల సైన్యంపెట్టు! అది రాజుకు స్థానబలాన్నీ, అంగబలాన్నీ సంపాయించి పెడుతుంది. అది ఎరిగినవాడు గనకే సత్యపాలుడు, ముందుగా ప్రభుత్వోద్యోగుల్లోని అవినీతినీ, ఆ కారణంగా దేశంలో ప్రబలిన అరాచకాన్నీ అణచివేశాడు. భిల్లరాజు జయసేనుడు తన దేశానికి స్వాతంత్ర్యం కోరుకున్నాడు తప్పితే, రాజు ప్రచండవర్మలా అదను చూసి చందనదేశాన్ని కబళించాలనే ఆలోచన చేయలేదు. కీర్తిసేన, తను సత్యపాలుడి పట్ల మనసున్న దానినని పరోక్షంగా తెలియపరిచేందుకే, అతణ్ణి తమ దేవి దగ్గిరకు తీసుకు వెళ్ళింది. అందువల్లనే మధూలికను తానై కోరి వివాహమాడడానికి నిరాకరించినవాడు, ఆమెను తానైమహారాణి కమ్మనికోరాడు.

అధముల్ని అడిగి అవుననిపించుకోవడంకంటే, ఉత్తముల్ని అడిగి లేదనిపించుకోవడం మేలన్న సూక్తి అందరెరిగినదే! అహంకారి అయిన మధూలిక, తనకు సత్యపాలుడి మీద అభిమానం వున్నా, తండ్రి యుద్ధప్రయత్నాలను వారించలేదు. అంటే—తండ్రి యుద్ధంలో సత్యపాలుణ్ణి గెలిచి, తనకు బహుమతిగా సమర్పిస్తాడన్న ఆలోచన ఆమెలో వుండి వుంటూంది. కాని, పరిస్థితులు మరొకలా పరిణమించడంతో, తండ్రి ప్రార్థనాపూర్వకంగా సత్యపాలుణ్ణి కోరడంద్వారా, అతణ్ణి వివాహమాడవలసి వచ్చింది.

సత్యపాలుడు రాజ్యాధికారానికి వచ్చిన నాటినుంచీ జరిగినదంతా పరిశీలించినప్పుడు, అతడు గొప్ప రాజనీతిజ్ఞుడేకాక, పరిస్థితుల ప్రభావం వల్ల తారుమారయ్యే మానవ సంబంధాలను క్షుణ్ణంగా అర్థం చేసుకుని, అందుకు అనుగుణంగా ప్రవర్తించగల వివేకి కూడా అని తెలుస్తున్నది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: లక్ష్మిగాయత్రి రచన]



# చందమామ అనుబంధం—47




మనదేశపు పక్షులు-జంతువులు: **పెద్దకొంగ**

పొడవాటి పెద్దకొంగలు ప్రపంచవ్యాప్తంగా ఉన్నాయి. పెద్దకొంగ(స్టార్క్)ల జాతికి చెందిన ఆఫ్రికా 'బోట్‌బిల్', ఆసియా ఖండానికి చెందిన బెగ్గురుకొంగ—ఈ రెండూ కూడా మన దేశానికి వలసవచ్చే పక్షులే. అయితే, నల్లమెడ గల కొంగలు మాత్రం మన దేశానికి చెందినవి. దాదాపు మనిషి అంత ఎత్తు ఎదిగే ఈ నల్లమెడ కొంగలే కొంగలన్నిటిలోకీ ఎత్తయినవి. ఇవి ఎర్రటి పొడవైన కాళ్ళూ, పెద్ద నల్ల ముక్కూ, దృఢమైన నీలం-పచ్చరంగు మెడా, దానికి దిగువ స్వచ్ఛమైన తెలుపూ, పైన మెరిసే నలుపురంగూ కలిగి ఉంటాయి. పొడవైన తెల్లరెక్కలతో అవి ఆకాశంలో ఎగురుతూన్నప్పుడు మధ్య నల్లటి గీతతో ఎంతో అందంగా కనిపిస్తాయి.

ఈ పక్షులు సాధారణంగా ఒంటరిగానే ఉంటాయి. అరుదుగా జంటలుగా కనిపిస్తాయి. అంతేగాని ఎప్పుడూ గుంపులుగా మాత్రం ఉండవు. చిన్నగా మూలగడం తప్ప, ఈ కొంగలు పెద్దగా అరవలేవు. ఇవి, లోతులేని నీళ్ళలో, చెపలనూ, కప్పలనూ, ఇతర ప్రాకుడు జంతువులనూ పట్టి తింటాయి. మన దేశం ఉత్తర, వాయవ్య ప్రాంతాలలో ఈ పక్షులు ఎక్కువగా ఉన్నాయి. కాని, దక్షిణాదిలో మాత్రం అరుదుగా కనిపిస్తాయి!



# మన సమకాలీన సాహిత్యం

[వివిధ భాషలకూ, విభిన్న సంస్కృతులకూ పుట్టినిల్లు మనదేశం. ప్రతి భారతీయ భాషలోనూ యుగయుగాలుగా చక్కని సాహిత్యం వెలువడుతున్నది. చాలామందికి ప్రాచీన సాహిత్యం గురించి తెలుసు. కాని మనదేశంలోని వివిధ భాషలలో వెలువడుతున్న ఆధునిక సాహిత్యం గురించి అంతగా తెలియదు. విభిన్న భారతీయ భాషలలో వెలువడిన ఉత్తమ నవలల కథలను ఇక్కడ క్లుప్తంగా ప్రచురిస్తున్నాము. ఇవి మునుముందు ఆ యా నవలలను చదవడానికి యువపాఠకులకు ఉత్సాహం కలిగించగలవని ఆశిస్తున్నాము.]

## ప్రేమ్‌చంద్ 'గోదాన్'



అయోధ్య సమీపంలోని బేలారీ గ్రామంలో నివసిస్తున్న పేదరైతు హోరీరామ్. అతనికి చాలా కాలంగా ఒక ఆవును కొనాలని కోరిక. అయితే, అందుకు అతని దగ్గర డబ్బు లేదు. అదే గ్రామవాసి అయిన భోలా భార్య చనిపోయింది. అతడు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. తనకు పెళ్ళి కూతురిని వెతకడంలో హోరీరామ్ సాయపడగలడని భోలా అతనికి ఒక ఆవును అప్పుగా ఇచ్చాడు.

హోరీరామ్ ఇంటికి భోలా ఇంటినుంచి ఆవు వచ్చింది. దానితోపాటు కొన్ని సమస్యలు కూడా వచ్చాయి. హోరీ కొడుకు గోబర్ ఆవును తోలుకురావడానికి భోలా ఇంటికి వెళ్ళాడు. అక్కడ బాలవితంతువయిన భోలా కూతురు ఝునియాను చూశాడు. పరిచయం ఏర్పడింది. రహస్యంగా ఆమెను వివాహమాడాడు.

హోరీరామ్ ఇంటికి వచ్చిన ఆవును చూడగానే, అతని సవతి తమ్ముడు హీరాకు, అసూయ కలిగింది. ఒకనాడు హీరా, ఆవుకు రహస్యంగా విషంపెట్టి, పట్టుబడిపోయాడు. శిక్ష పడుతుందన్న భయంతో వాడు గ్రామం వదిలి పారిపోయాడు.

కొన్నాళ్ళకు గోబర్ ఝునియాల వివాహ విషయం బయటపడింది. ఒక వితంతువును వివాహమాడడం; అదీ తల్లిదండ్రులకు తెలియకుండా పెళ్ళి చేసుకోవడం చాలా పాపం అన్నారు గ్రామస్థులు. అయినా, హోరీరామ్ భార్య ధనియా, ఝునియామీద కనికరం చూపింది. తన ఇంట ఆశ్రయం ఇచ్చింది. అయినా భోలా తన కూతురి పాపాన్ని క్షమించలేకపోయాడు. ఆమెను ఇంటి నుంచి తరిమి వేయమని హోరీని కోరాడు. అందుకు హోరీ సమ్మతించలేదు. ఆగ్రహం చెందిన



భోలా, తన చనిపోయిన ఆవు ధరను చెల్లించమని పట్టుపట్టాడు. హోరీరామ్ వల్ల కాలేదు. కాబట్టి అతని ఎద్దులను భోలా తోలుకుపోయాడు.

గోబర్ లక్నోకు వెళ్ళాడు. అతడు అక్కడ కొంత డబ్బు సంపాయించుకుని కొంత కాలానికి, స్వగ్రామానికి తిరిగివచ్చాడు. గ్రామప్రజలు అతన్ని మెచ్చుకున్నారు. భోలా, హోరీరామ్ ఎద్దులను తిరిగి ఇచ్చివేశాడు.

ఝునియా, భర్తతోపాటు నగరం చేరింది. అయితే, ఆమెకు నగరజీవితం అంతగా నచ్చలేదు. ఇంతలో ఆమె మొదటి బిడ్డ చనిపోయింది. గోబర్ ఒక ఫ్యాక్టరీలో పని చేసేవాడు. రోజూ సాయంకాలం తప్ప తాగివచ్చి పెళ్ళాన్ని వేధించేవాడు. ఫ్యాక్టరీలో సమ్మె జరిగింది. రెండు ముఠాలమధ్య జరిగిన తగాదాలో గోబర్ బాగా గాయపడ్డాడు. ఝునియా అతనికి పరిచర్యలు చేసి అతన్ని మామూలు మనిషిని చేసింది. దాంతో అతని ప్రవర్తనలో, భార్యపట్ల అతని ధోరణిలో కూడా మంచి మార్పులు వచ్చాయి. ప్రముఖ సంఘసేవకురాలు డా॥ మాలతి ఇంట తోటమాలిగా చేరాడు. గోబర్ రెండవ కొడుకు బాగోగులు డా॥ మాలతి చూడసాగింది.

అయితే, గ్రామంలో హోరీరామ్ జీవితం మరీ పోరాటంగా తయారయింది. అతడు తన పెద్ద కూతురి పెళ్ళికని అప్పులు చేశాడు. ఆ అప్పులు తీర్చడానికి చిన్న కూతురు రూపను, భార్య పోయిన ఒక వయసు మీరిన ధనవంతుడికిచ్చి పెళ్ళి చేయవలసివచ్చింది. అయినా, రూప అందుకు విచారించలేదు. ఆమె అక్కడి సంపదలను చూసి ఎంతో మురిసిపోయింది. తన తండ్రికి ఒక ఆవును కూడా పంపింది.

అయితే, అసరికి, హోరీరామ్ రాళ్లెత్తే కూలీగా పనిచేసి బాగా బలహీనుడై పోయాడు. మరణం సమీపించింది. చనిపోవడానికి ముందు అతనికి ఎంతో కొంత సంతృప్తికూడా మిగిలింది. గోవును చంపిన తమ్ముడు హీరా తిరిగి వచ్చి, పశ్చాత్తాపం చెంది క్షమాపణలు చెప్పుకున్నాడు. గోబర్ రెండవ కొడుకైన తన మనవణ్ణి చూసి ఆనందించాడు. హోరీ చనిపోతూ, తన ఆత్మకు శాంతి కలిగించే విధంగా గోదానం చేయమని ధనియాను కోరాడు. అప్పుడు ధనియా చేతిలో రెండు నాణాలు మాత్రమే ఉన్నాయి. వాటిని ఆమె చల్లబడిపోయిన తన భర్త అరచేతిలో ఉంచి, ఆ పైకాన్ని గోదానంగా స్వీకరించమని బ్రాహ్మణ్ణి ప్రార్థించి, అలాగే స్పృహతప్పి పడిపోయింది.

ఇదీ క్లుప్తంగా కథ. కాని, నవల ఆద్యంతం—పేదల బాధలనూ, నాటి గ్రామజీవితాన్నీ, దురాశాపరుల కపట ప్రవర్తననూ, బాహ్యపరిస్థితులు మానవ సంబంధ బాంధవ్యాలలో తెచ్చే మార్పులనూ కళ్ళకు కట్టినట్టు వివరించారు రచయిత.

ఆధునిక భారతీయ సాహిత్యంలో అగ్రగామిగా పేరుగాంచిన ప్రేమ్‌చంద్ హిందీ రచనలలో ప్రధానమైనది 'గోదాన్'. 1880వ సం॥లో వారణాసి సమీపంలో ఆయన జన్మించారు. మొదట ఉర్దూలోనూ, ఆ తర్వాత హిందీలోనూ రచనలుచేసిన ఆయన 1936వ సం॥లో కీర్తిశేషులయ్యారు.

# మీకు తెలుసా?

1. పదిహేనవ శతాబ్దానికి చెందిన వైష్ణవభక్తుడు విద్యాపతి ఏ భాషలో కవిత్వం రాశాడు ?
2. ఉరకలెత్తుతూ వచ్చిన గంగాప్రవాహాన్ని తాగేసి, ఒక ముని, తన చెవి గుండా వదలడం వల్ల గంగకు ఒక పేరుకూడా వచ్చిందని మన పురాణాలు పేర్కొంటాయి. ఆ ముని ఎవరు? నదికి వచ్చిన పేరేమిటి ?
3. భారత ప్రధాని లాల్‌బహదూర్‌శాస్త్రి 1966 వ సం॥ ఎవరితో చర్చలు జరపటానికి తాష్కెంట్ వెళ్ళారు ?
4. థానేశ్వరం–కనూజ్‌లో హర్షవర్ధనుని ఓడించిన దక్షిణ దేశపు రాజు ఎవరు ?
5. క్రీ.పూ. 5వ శతాబ్దంలోనే ప్రస్తావించబడిన మొట్టమొదటి భారతీయ శిల్పి ఎవరు ?
6. మహాభారతం ప్రకారం జనమేజయుడి సర్పయాగం నుంచి తప్పించుకున్న కపట సర్పరాజు పేరేమిటి ?
7. ఆరు ఋతువులకూ ధన్యవాదాలు తెలుపుతూ పారశీకులు పండుగలు జరుపుకుంటారు. ఆ పండుగల పేరేమిటి ?
8. 'ఏకలవ్య' 'రాణిలక్ష్మి' అవార్డులను ఏ క్రీడలకు ఇస్తారు ?
9. మనదేశంలో ఎక్కువ రాష్ట్రాలగుండా నడిచే రైలుబండి ఏది ?
10. ఉత్తర కేరళ రాష్ట్రంలోని 'తెల్లిచ్చేరి' ఏ విషయంలో ప్రపంచ ప్రసిద్ధి గాంచింది ?
11. మనదేశంలో చాలా పెద్దది 'ఫరాక్కా బ్యారేజి'. మరి అది ఎందుకు నిర్మించబడిందో తెలుసా ?
12. అజంతా వర్ణచిత్రాల ప్రత్యేకత ఏమిటి ?
13. రాజీవ్ గాంధి హత్యకు గురైన శ్రీపెరుంబుదూరు, సుప్రసిద్ధ వైష్ణవాచార్యుల జన్మస్థలం. ఆయన ఎవరు ?
14. శివాలయాలలో నటరాజ ఆలయంగా అత్యంత ప్రసిద్ధి చెందిన దేవాలయం ఏది ?

## సమాధానాలు

1. బ్రజ్‌బోలీ.
2. జాహ్ను–జాహ్నవి.
3. పాకిస్థాన్ ప్రెసిడెంట్ అయూబ్‌ఖాన్.
4. రెండవ పులకేశి.
5. మహాగోవింద—ధమ్మపాదలో.
6. తక్షకుడు.
7. గాహంబర్స్.
8. ఖో–ఖో.
9. జమ్ము నుంచి కన్యాకుమారి వరకు నడిచే హిమగిరి ఎక్స్‌ప్రెస్. తమిళనాడు, కేరళ, ఆంధ్ర, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, హర్యానా, జమ్ము-కాశ్మీర్ మొదలైన తొమ్మిది రాష్ట్రాల గుండా నడుస్తుంది.
10. మనదేశంలో మొట్టమొదటి 'సర్కస్' తెల్లిచ్చేరిలోనే ఆరంభమయింది. ఆ తర్వాత అక్కడినుంచి ఎక్కువమంది సర్కస్ కళాకారులు వచ్చారు.
11. కలకత్తా ఓడరేవును లోతుచేయడానికి.
12. కుడ్యచిత్రాలు.
13. రామానుజాచార్యులు.
14. చిదంబరం.



# తిరుపతయ్య సలహాలు

రుద్రవరం అనే గ్రామంలో వుండే తిరుపతయ్య డబ్బు బాగా సంపాయించాడు. కాని అతడిలో ఉపకారగుణం లేదు. తన సాయం కోసం వచ్చిన వాళ్ళకు నష్టం కలిగించే సలహాలివ్వడం అయనకు సరదా!

ఒకసారి తిరుపతయ్య పొరుగున వుండే చలపతికి పెద్ద జబ్బు చేసింది. వైద్యుడు వచ్చి చూసి, ''కృష్ణతులసి ఆకు పసరు వేస్తే ఈ జబ్బు తగ్గిపోతుంది. కానీ ఈ గ్రామంలో తిరుపతయ్య పెరట్లోతప్ప కృష్ణతులసి వేరే ఎక్కడా లేదు,'' అన్నాడు.

చలపతి కొడుకు వెంటనే తిరుపతయ్య ఇంటికి వెళ్ళి ఆయనకు విషయం చెప్పాడు. ఆయన వెంటనే, ''కృష్ణతులసి ఆకులు కోయడం మహాపాపం. నా ఇంట్లో ఏ పాపమూ జరగడానికి వీల్లేదు. ఈ గ్రామంలో శెట్టి దుకాణంలో నీకు కృష్ణతులసి విత్తనాలు దొరుకుతాయి. అవి తెచ్చుకొని మీ ఇంట్లో పాతుకోండి. మొక్కలు మొలవగానే వైద్యం చేసుకోండి,'' అని చెప్పాడు.

చలపతి కొడుకు ఉసూరుమంటూ అక్కణ్ణించి బయల్దేరి, ఎదురు పడిన ప్రతి ఒక్కరినీ కృష్ణతులసి గురించి అడగసాగాడు. అప్పుడు వాడికి బైరాగి ఒకడు ఎదురుపడి విషయం తెలుసుకుని, ''తిరుపతయ్య నీకు మంచి సలహా ఇచ్చాడు. వెళ్ళి ఆయన చెప్పిన ప్రకారమే చెయ్యి,'' అన్నాడు.

బైరాగి ముఖంలో తేజస్సుచూసి చలపతి కొడుకు మరేమీ అనలేక, శెట్టి దుకాణానికి వెళ్ళి గింజలు తెచ్చుకుని పెరట్లో పాతగానే వెంటనే మొక్కలు మొలిచి, వాటిలో ఒకటి పెద్దదై మహావృక్షంగా మారి



పాతిపెట్టు. అక్కడొక చెట్టు మొలిచి నీకు డబ్బు కాసి పెడుతుంది,'' అన్నాడు.

చలపతి తిరిగి వచ్చి జరిగింది చెప్పి, ''ఆ తిరుపతయ్య పరమ నీచుడని మరొకసారి ఋజువు చేసుకున్నాడు. నా డబ్బంతా నేలపాలు చేయాలని వాడి కోరిక,'' అన్నాడు.

బైరాగి నవ్వి, ''నీకింకా ఆ సలహాల గొప్పదనం అర్థంకాక అలా అంటున్నావు. నామాట నమ్ము. తిరుపతయ్య చెప్పినట్లే చెయ్యి,'' అన్నాడు.

చలపతి అలాగే చేశాడు. రాత్రికిరాత్రి వాళ్ళింటి పెరట్లో ఒకపెద్ద చెట్టుమొలిచి, కొమ్మ కొమ్మకూ బోలెడు డబ్బులు కాసింది.

బైరాగి, చలపతితో, ''చెట్టుకున్న డబ్బులన్నీ కోసుకుని కలకాలం సుఖంగా జీవించు. రేపటికల్లా ఈ చెట్టూ, కృష్ణ తులసీ రెండూ మాయమవుతాయి,'' అని చెప్పాడు.

చలపతి, బైరాగికి సాష్టాంగపడి, ''స్వామీ! ఇదంతా మీ మహిమవల్ల జరిగింది. మీరు పరమ నీచుడైన తిరుపతయ్యకు లేని గొప్పతనం అంటగడుతున్నారు. కారణం నాకు తెలియడం లేదు,'' అన్నాడు.

పోయింది. ఆ చెట్టు ఆకుల పసరుతో చలపతి జబ్బు త్వరలో మటుమాయమయింది.

ఆ తర్వాత బైరాగి, చలపతిని కలుసుకుని, ''తిరుపతయ్య సలహా వల్లనే, నీ జబ్బు నయమయింది. నువ్వు వెళ్ళి తిరుపతయ్యకు కృతజ్ఞతలు చెప్పుకో. తిరుపతయ్య సలహాలు చాలా గొప్పవి కాబట్టి, నువ్వు జీవితంలో బాగుపడే ఉపాయం చెప్పమని అడుగు,'' అని చెప్పాడు.

చలపతి, బైరాగి చెప్పినట్లే చేశాడు. తిరుపతయ్య అంతా విని వాడితో, ''నీ ఇంట్లో వున్న డబ్బంతా మూటకట్టి పెరట్లో

''తిరుపతయ్యను నువ్వు అపార్థం చేసుకున్నావు. అతడు మహాపుణ్యాత్ముడు." అని చెప్పి బైరాగి వెళ్ళిపోయాడు.

ఆ మాటల కాశ్చర్యపడినా, తిరుపతయ్య గురించి తన కెందుకులే అనుకొని, చలపతి చెట్టుకాడ్కసిన డబ్బంతా కోసుకుని సుఖంగా రోజులు గడపసాగాడు. స్వతహాగా మంచివాడు కావడంవల్ల, చలపతి పదిమందికీ చేతనైనంత సాయం కూడా చేసేవాడు.

రోజులు గడుస్తున్నాయి. ఒకరోజున నారప్ప అనేవాడు చలపతి వద్దకు వచ్చి, ''సమయానికి పుణ్యాత్ముడు తిరుపతయ్య గ్రామంలోలేక నిన్ను అడగవలసొచ్చింది. నాకో పది వరహాలు అప్పు కావాలి." అన్నాడు.

చలపతి ఆశ్చర్యపడి నీకు డబ్బు కావాలని సూటిగా అడిగితే నే నివ్వనా? మధ్య నీచుడు, లోభి అయిన తిరుపతయ్యను గురించి గొప్పగా చెబుతావేం?" అన్నాడు.

నారప్ప చిరాకుపడి, ''ఇంతకాలం నిన్ను మంచివాడి వనుకున్నాను. అడిగిన వెంటనే, ఎందుకూ అని అడక్కుండా వెంటనే డబ్బిచ్చి సాయపడే మంచివాడు తిరుపతయ్యను ఆడిపోసుకోవడం నీకు తగదు,'' అన్నాడు.

చలపతి మారు మాట్లాడకుండా వాడికి డబ్బిచ్చి పంపి, గ్రామంలో వాకబు



చేయగా తిరుపతయ్య గ్రామంలో మంచి పేరు సంపాదించుకున్నట్లు తెలిసింది. అప్పుడు వాడి మనసుకెంతో బాధ కలిగి, "అందరితోనూ మంచిగా వుండే తిరుపతయ్య, నాతోనే చెడ్డగా వున్నాడంటే నాలోనే ఏదో లోపముండి వుండాలి. లేదా ఉపకారబుద్ధితోనే తిరుపతయ్య నాకు మంచి సలహాలిచ్చి వుండాలి. నేనే అపార్థం చేసుకున్నానేమో!" అనుకున్నాడు.

మర్నాడు తిరుపతయ్య ఊరునుంచి తిరిగి రాగానే చలపతి ఆయన ఇంటికి వెళ్ళి ఆయనను కలుసుకుని, "బైరాగి నీ సలహా గురించి పొగిడితే నమ్మక జరిగినదంతా ఆయన మహిమ అనుకున్నాను. అయినా ఇప్పుడు నాకు అసలు విషయం తెలిసింది. నిన్ను అపార్థం చేసుకున్నందుకు క్షమించు!" అంటూ జరిగినదంతా వివరంగా చెప్పాడు.

తిరుపతయ్య అంతా విని, "ఇదంతా ఆ బైరాగి మూలానే జరిగింది. మళ్ళీ ఆయన కనబడితే నాకు వచ్చి చెప్పు. ఆయన ఈ గ్రామం వచ్చి వెళ్ళినప్పటి నుంచీ, నా సలహాలు అందరికీ ఎక్కువ ప్రయోజనకరంగా వుంటున్నాయి. సలహాలకంటే అడిగిందిచ్చి సాయపడితేనే, వాళ్ళకు తక్కువ లాభం వస్తున్నది! అందుకని నేను కొంతకాలంగా వచ్చిన వాళ్ళకు సలహాలివ్వడం మానేశాను, బైరాగి మళ్ళీ వచ్చి పరిష్కారం చెప్పేదాకా, నా బ్రతుకిలాగే ఈడ్చక తప్పదు," అంటూ నిట్టూర్చాడు.

ఎదుటివారికి తక్కువ లాభాలు రావాలన్న అసూయ కొద్దీ, తిరుపతయ్య తనకున్నది కూడా పోగొట్టుకునేందుకు సిద్ధపడ్డాడు తప్ప, తనకేమీ ఖర్చు కాకపోయినా మంచి సలహాలిచ్చి వాళ్ళకు ఎక్కువ లాభం రానివ్వడు! తిరుపతయ్య కుచ్ఛిత బుద్ధెరిగి బైరాగి అతడికి తిరుగులేని శిక్ష విధించాడని గ్రహించి, తేలిక పడిన మనసుతో ఇంటి ముఖం పట్టాడు, చలపతి.



# చందమామ కబుర్లు



## అంధుల పర్వతారోహణ!

మహారాష్ట్రకు చెందిన పదిమంది చూపులేని యువకులు హిమాలయ పర్వతారోహణకు బయలుదేరారు. వాళ్ళలో ముగ్గురు 17,220 అడుగుల ఎత్తైన 'శితిధర్' పర్వత శిఖరాన్ని అధిరోహించి, ఒక అద్భుతం సాధించారు. అంధులు ఇంత ఎత్తైన శిఖరాన్ని అధిరోహించడం ఇదే ప్రథమం. వీళ్ళు డార్జిలింగ్‌లోని 'హిమాలయ పర్వతారోహణ శిక్షణాకేంద్రం'లో ప్రత్యేక శిక్షణ పొందారు

## పేర్ల గందరగోళం

చైనా జనాభా ప్రస్తుతం 107 కోట్లా 20 లక్షలు! మరి ఇందులో 7 కోట్లా 20 లక్షల మందికి ఒకే పేరు "వాంగ్!" ఒక వాంగ్ నుంచి మరొక వాంగ్‌ను వేరుచేయడానికి ఇబ్బంది పడుతున్నారు. చైనాలో ఒకే అక్షరం ఇంటి పేరు గత 2000 సంవత్సరాలుగా ఉంటున్నది. ఇటీవల దీనిని మార్చడానికి ప్రయత్నాలు జరిగాయి. ఏకాక్షర నామాలను — 'వాంగ్-జాన్', 'వాంగ్-ఝాంగ్' అని ఇతర నామాలతో కలుపుతున్నారు. 'షాన్‌డాంగ్' ప్రాంతంలో 2,800 పేర్లను ఇలా మార్చారు గాని, పెద్ద ప్రయోజనం కనిపించలేదు. లీ, లూ, ఝాంగ్ అనే పేర్లతో దాదాపు 25 కోట్లమంది ఉన్నారు. మరి వాళ్ళను ఎలా కనుగొనడం అన్నదే మరొక సమస్య!






## అతిపిన్న వయసు పట్టభద్రుడు!

ఇంగ్లాండులో ఇవాళ అతిపిన్న వయసు పట్టభద్రుడు— భారతీయ సంతతికి చెందిన గణేశ్ సిర్దంబలం. గణేశ్, సర్రే విశ్వవిద్యాలయం నుంచి గణితశాస్త్రంలో బి. ఎస్‌సి. ఆనర్స్ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడై, సరికొత్త రికార్డును సృష్టించాడు. అంతకు పూర్వం ఈ విశిష్టత 13 ఏళ్ళ, 7 నెలల ప్రాయంలో డిగ్రీ పుచ్చుకున్న రూత్ లారెన్స్‌కు ఉండేది. అయితే గణేశ్‌కు గణితంలో ప్రత్యేక కృషి చేయాలని లేదు. అతడు అందరిలాగే 16 వ యేట జి.సి.ఎస్.ఇ. పూర్తిచేసి, ఆ తరవాత విశ్వవిద్యాలయంలో చేరాలనుకుంటున్నాడు. అతడిప్పుడు కేవలం సరదాకోసమే బి.ఎస్.సి పరీక్షలు రాశాడన్నమాట!



# మతిలేని సాక్ష్యం

ఒక వ్యాపారి వ్యాపారనిమిత్తం దూర దేశానికి పోతూ పొద్దుగూకే వేళకు ఒక గ్రామం చేరుకున్నాడు. ఆ రాత్రి ఆ గ్రామంలోనే గడుపుదామని నిశ్చయించిన వ్యాపారి తన గుర్రాన్ని గ్రామంకేసి నడిపిస్తూ ఉండగా దారిలో ఒక మనిషి ఎదురువచ్చి, ''అయ్యా, నాలుగు అణా లిప్పించండి. నాకు కొన్నాళ్ళనుంచి నల్ల మందు అలవాటయింది. అది వేసుకోక పోతే విపరీతంగా కడుపునొప్పి వస్తుంది. రెండు రోజుల నుంచీ దగ్గిర కానీ కూడా లేక చాలా బాధపడుతున్నాను,'' అన్నాడు.

వాడికినాలుగణాలిచ్చి పంపేసివ్యాపారి ఊళ్ళోకి వెళ్ళాడు. ఒక ఇంటిముందు గుర్రం దిగి, ఇంటియజమానిని ఆ రాత్రికి అక్కడ పడుకోనివ్వమన్నాడు. ఇంటి యజమాని ఒప్పుకున్నాడు.

వ్యాపారి తన గుర్రాన్ని ఇంటి బయట వున్న కట్టుకొయ్యకు కట్టేసి ఆ రాత్రి ఆ యింటనే పడుకున్నాడు.

వ్యాపారి తెల్లవారి లేచి తిరిగిప్రయాణం సాగింతామని బయటికి వచ్చేసరికి, అతని గుర్రాన్ని ఇంటి యజమాని ఎక్కడికో తోలుకు పోబోతున్నాడు.

''అయ్యా, నేను వెళ్ళిపోబోతున్నాను. దయచేసి నా గుర్రాన్ని ఎటూ తీసుకు పోకండి,'' అని వ్యాపారి గొంతెత్తి హెచ్చ రించాడు.

ఇంటి యజమాని అమిత ఆశ్చర్యంతో, ''ఇది నా గుర్రం. నా ఇంటిముందున్న కట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడు తుంది,'' అన్నాడు.

''అయ్యా, నా గుర్రాన్ని హరించటానికి యత్నిస్తున్నారు. ఇది న్యాయం కాదు,'' అన్నాడు వ్యాపారి.

"నామాట నమ్మకం లేకపోతే, ఈ ఊళ్ళో ఎవరినన్నా అడుగు మా ఇంటి కట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడుతుందని అందరికీ తెలుసు," అన్నాడు ఇంటి యజమాని.

ఆ మనిషి పచ్చిదొంగ. ఆ వూళ్ళోచాలా మంది అతనిలాటివాళ్ళే. తెలియక పొరుగూరివాడు వస్తే, అందరూ కలిసి మోసం చేస్తూ ఉంటారు. అందుచేత, అందరూ ఆ ఇంటి యజమాని చెప్పేదాన్నే బలపరిచారు.

ఇక చేసేదిలేక వ్యాపారి గ్రామాధికారి వద్దకుపోయి ఇంటి యజమానిపై ఫిర్యాదు చేశాడు. గ్రామాధికారి ఇంటియజమానిని పిలిపించి అడిగాడు.

"చిత్తం, మాయింటి కట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడుతుందండి. కావలిస్తే బోలెడుమందిచేత సాక్ష్యం ఇప్పించగలను," అన్నాడు ఇంటి యజమాని ఎంతో ధీమాగా.

"ఏమయ్యా? ఈ గుర్రం నీదేనని నీకెవరైనా సాక్షులున్నారా? ఉంటే తెచ్చుకో!" అన్నాడు గ్రామాధికారి వ్యాపారితో.

కిందటిసాయంకాలం నల్లమందుకోసం తనవద్ద నాలుగణాలు పుచ్చుకున్న మనిషి సంగతి జ్ఞాపకంవచ్చి, వ్యాపారి అతన్ని వెతుక్కుంటూ వెళ్ళాడు. ఈలోగా ఇంటి యజమానికూడా తనవైపు సాక్ష్యం చెప్పేవారిని తీసుకురావటానికి వెళ్ళాడు.



వ్యాపారిదగ్గిర నాలుగణాలు పుచ్చుకున్న మనిషి ఇంకా నల్లమందు మత్తులోనే ఉన్నాడు. వ్యాపారి ఆ నల్లమందు భాయీని కష్టపడి లేపి తనకు జరిగిన అన్యాయాన్ని గురించి చెప్పాడు. అది వినగానే ఆ నల్లమందుభాయీ తిన్నగా వ్యాపారి వెంట న్యాయాధికారి వున్న చోటుకు వచ్చాడు.

అప్పటికే ఇంటి యజమాని తన సాక్షులను తెచ్చి గ్రామాధికారి ఎదుట పెట్టి, తన ఇంటి కట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడుతుందని సాక్ష్యం చెప్పిస్తున్నాడు. నల్లమందుభాయీని చూడగానే ఇంటి యజమాని సాక్షులు పట్టరాని సంతోషంతో బిగ్గరగా నవ్వి, ''వెతికి వెతికి ఈ నల్లమందు భాయీనా సాక్ష్యం తెచ్చావు? వీడి మాట ఎవరు నమ్ముతారు?'' అని వ్యాపారినిచూసి గేలిచేశారు.

మత్తు పూర్తిగా పోక ఆవలిస్తున్న నల్లమందుభాయీని చూసి గ్రామాధికారి కూడా, ''ఏమయ్యా, బాగా నల్లమందు మత్తులో ఉన్నట్టున్నావు. అలాంటి నీ సాక్ష్యం ఎలా ఆమోదించేది?'' అన్నాడు.

దానికి నల్లమందుభాయీ తడుపుకోకుండా, ''అయ్యా, నేను మత్తులో లేను. రాత్రల్లా చెరువు అడుగున మంటచేసి చెరువులో చేపల్ని ఉడకబెట్టాను. కన్ను మూస్తే ఒట్టు. అందుచేత నిద్రమత్తుగా వుంది. అంతే!'' అన్నాడు.

ఈ మాటకు అందరితోపాటు గ్రామాధికారికూడా నవ్వి, ''నీది మతిలేని సాక్ష్యమని నీ మాటలే రుజువు చేస్తున్నాయి. చెరువుకింద ఎవరన్నా మంట చేస్తారా?'' అని అడిగాడు.

''అదేమిటండీ? కట్టుకొయ్యలుగుర్రాల నీనగా లేంది, చెరువుకింద మంట బెట్టటం అబ్బురమా? నాదా మతిలేని సాక్ష్యం?'' అని అడిగాడు నల్లమందుభాయీ.

ఈ మాటలకు గ్రామాధికారి ఎంతో సిగ్గుపడి, వ్యాపారి గుర్రాన్ని వ్యాపారికిప్పించి, ఇంటి యజమానిని గట్టిగా హెచ్చరించాడు.






హనుమంతుడు ఓషధుల కోసం వెతకటం మొదలుపెట్టేసరికి వాటి జాడ తెలియ లేదు. అన్ని మొక్కలూ ఒకలాగే ఉన్నాయి. హనుమంతుడు మండిపడి, పర్వతశిఖరాన్ని పెల్లగించి దాన్ని తీసుకుని బయలుదేరాడు.

పెద్ద కొండతో తిరిగి వస్తున్న హనుమంతుణ్ణి చూసి వానరులు సంతోషంతో గర్జించారు. అది విని హనుమంతుడు కూడా గర్జించాడు. అతను కిందికి దిగి, వానరులలో పెద్దలకు నమస్కరించి, విభీషణుణ్ణి కౌగలించుకున్నాడు.

ఓషధుల మీదుగా వచ్చే గాలి పీల్చి రామ, లక్ష్మణులు స్వస్థత చెందారు. వానరులు కూడా మూర్ఛ తెలిసి, లేచారు. చచ్చిపడిపోయిన వానరులు ఓషధుల వాసన తగలగానే బతికి లేచారు. వారి శరీరబాధలన్నీ పోయాయి. అలాగే అనేకమంది రాక్షసులు కూడా బతికి ఉండేవారేమో కాని యుద్ధంలో చచ్చిపోయిన రాక్షసులందరినీ రావణుడు రహస్యంగా ఉండగలందులకు సముద్రంలో పడేయించాడు.

ఓషధులతో పని తీరిపోగానే హనుమంతుడు ఓషధీ పర్వతాన్ని యథాస్థానంలో ఉంచి, రామ, లక్ష్మణుల వద్దకు తిరిగి వచ్చాడు.

తిరిగి వచ్చిన హనుమంతుడితో సుగ్రీవుడు, ''కుంభకర్ణుడు చచ్చాడు, రావణుడి కొడుకులూ చచ్చారు. అందు

**28. ఇంద్రజిత్తు హోమం**



చేత రావణుడు ఇప్పుడు యుద్ధానికి రాడు. ఈ రాత్రికి బలవంతులైన వానరులు దివిటీలు తీసుకుని లంకకు వెళ్ళాలి,'' అన్నాడు.

సూర్యాస్తమానమై, చీకటి పడగానే వానర వీరులు దివిటీలు పట్టుకుని లంకకు బయలుదేరారు. ద్వారాల వద్ద కాపలా ఉన్న రాక్షసులు వానరులకు బెదిరి పారిపోయారు. వానరులు, తమను అడ్డేవారు లేక, నగరద్వారాలకూ, బురుజులకూ, వీధులలోనూ, ఇళ్ళకూ నిప్పు పెట్టేశారు. ఇళ్ళు అసంఖ్యాకంగా తగలబడ్డాయి. ఇళ్ళతోబాటు ఇళ్ళలో ఉండే అమూల్యమైన వస్తువులు కూడా తగలబడ్డాయి. చాలామంది రాక్షసులు కూడా మంటలలో చచ్చారు. వానరుల హర్ష ధ్వానాలూ, రాక్షసుల ఆర్తనాదాలూ మిన్నుముట్టాయి.

రాక్షసులు ఈ పరిస్థితిలో యుద్ధానికి సిద్ధపడ్డారు. కాని ఈసారి వాళ్ళు వానరులను లంకానగరంలోనే ఎదుర్కొవలసి వచ్చింది.

''మీరు రావణుడి మందిరం సమీపంలో రాక్షసులతో యుద్ధం చెయ్యండి,'' అని సుగ్రీవుడు వానరులకు ఆజ్ఞఇచ్చాడు. అతని ఆజ్ఞ ప్రకారం దివిటీలు పట్టుకున్న వానరులు తన మందిర ద్వారాల వద్ద నిలబడి ఉండటం చూసి రావణుడికి చాలా కోపం వచ్చింది. అతను కుంభకర్ణుడి కొడుకులైన కుంభ, నికుంభులను వానరుల మీద యుద్ధానికి పంపాడు. కుంభ, నికుంభుల వెంట యూపాక్షుడూ, శోణితాక్షుడూ, ప్రజంఘుడూ, కంపనుడూ కూడా వెళ్ళారు.

ఉభయపక్షాలకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అంగదుడు కంపనుణ్ణి చంపాడు. తరవాత అతను శోణితాక్షుడి ఖడ్గం లాగేసుకుని, దానితోనే అతన్ని చంపి, ఇతర రాక్షసుల మీదికి వెళ్ళాడు. అతని చేతిలో ప్రజంఘుడూ చచ్చాడు. యూపాక్షుడు మైందుడి చేతిలో చచ్చాడు.



కుంభుడితో యుద్ధంచేస్తూ అంగదుడు మూర్ఛపోయాడు. అదితెలిసి రాముడు అంగదుడికి తోడుగా జాంబవంతుడు మొదలైనవారిని పంపాడు. కాని వాళ్ళు కుంభుడి బాణాలను ఎదుర్కొని, అతన్ని సమీపించలేకపోయారు. అదిచూసి సుగ్రీవుడు కుంభుడి బాణాలను సహిస్తూ, అతన్ని సమీపించి, అతని ధనస్సును విరిచి, అతనితో కలియబడి యుద్ధం చేశాడు. ఆ మల్లయుద్ధంలో చివరకు కుంభుడు చచ్చాడు.

తన అన్న చచ్చినందుకు ఆగ్రహించి నికుంభుడు పరిఘ నొకదాన్ని గిరగిరా తిప్పి, ఎదురుగాకనిపించిన హనుమంతుడి రొమ్ముకేసి విసిరాడు. అది హనుమంతుడి రొమ్ముకు తగిలి, ముక్కలై కింద పడింది. కాని హనుమంతుడు మంచిదెబ్బతిన్నాడు. ఆ కోపంతో అతను పిడికిలిబిగించి నికుంభుడి రొమ్ములో బలంకొద్దీ పొడిచాడు.

ఆ దెబ్బకు నికుంభుడు నెత్తురు కార్చుకుని, మూర్ఛపోయి, తిరిగి లేచి హనుమంతుడితో కలియబడ్డాడు. హనుమంతుడు ఉగ్రుడైపోయి, నికుంభుడి గొంతు పట్టుకుని గిరగిరా తిప్పి, అతని తల విరిచి చంపాడు.

కుంభ, నికుంభులు చచ్చినందుకు ఏడ్చి, రావణుడు యుద్ధానికి ఖరుడి కొడుకైన మకరాక్షుణ్ణి పంపాడు. మకరాక్షుడు రాముడితో యుద్ధం చేసి, చచ్చాడు.

ఈ వార్త అందగానే రావణుడు కోపంతో పళ్ళుకొరికి, ఇంద్రజిత్తును యుద్ధానికి వెళ్ళమన్నాడు. ఇద్రజిత్తు హోమం చెయ్యటానికి యాగభూమికి వెళ్ళాడు. అతనిరాక చూసి, అక్కడ ఉండే రాక్షస స్త్రీలు ఋత్విజులు ధరించటానికి ఎర్ర తలగుడ్డలు తెచ్చారు.

ఇంద్రజిత్తు చేసిన హోమం అతి చిత్రమైనది. అతను దర్భలకు బదులు తన ఆయుధాలూ, సమిధలకు తాంద్ర పుల్లలూ, స్రుక్, స్రువాలుగా ఇనుప పాత్రలూ వాడాడు. అతని ఋత్విజులు



ఎర్రబట్టలు కట్టుకున్నారు. హోమం కోసం అతను నల్లమేక కంఠం నరికాడు. విజయ సూచకంగా అగ్ని పొగలేకుండా మండింది. ఈవిధంగా ఇంద్రజిత్తు అగ్నిలో హోమం చేసి, దేవ, దానవ రాక్షసులకు తర్పణాలిచ్చి, మాయమయ్యేశక్తిగల తన రథాన్ని ఎక్కాడు. ఆ రథం సూర్యుడిలాగా వెలిగిపోతున్నది.

ఇంద్రజిత్తు అంతర్ధానమై యుద్ధరంగానికి వచ్చాడు. అతను వానరసేన మధ్య రామ, లక్ష్మణులను గుర్తించి, వారి మీద బాణవర్షం కురిపించాడు. రామ, లక్ష్మణులు తమ బాణాలతో ఆకాశమంతా కప్పినా, అవి ఇంద్రజిత్తుకు తగలలేదు. అతని బాణాలు రాముడి అన్ని అవయవాలనూ గాయపరిచాయి. రామలక్ష్మణులు తమ బాణాలతో ఇంద్రజిత్తు బాణాలను చాలావరకు ఖండించారు. అతని బాణాలు వానరసేనలో అమితమైన నష్టాన్ని కలిగిస్తున్నాయి.

లక్ష్మణుడికి చాలా కోపం వచ్చి, ''నేను బ్రహ్మాస్త్రం ప్రయోగించి రాక్షసులనందరినీ చంపేస్తాను," అని రాముడితో అన్నాడు.

రాముడు అందుకు ఒప్పుకోక, ''ఒక్కడి కోసం భూమి మీద ఉండే రాక్షసులనందరినీ చంపుతాననటం భావ్యంకాదు. మనం ఇంద్రజిత్తును మాత్రమే చంపే ప్రయత్నంచేద్దాం. దివ్యాస్త్రాలను ప్రయోగిద్దాం,'' అన్నాడు.

ఇంతలో ఇంద్రజిత్తుకు ఏదో ఆలోచన వచ్చింది. అతను యుద్ధభూమి నుంచి లంకానగరంలోకి తిరిగివెళ్ళి, మాయ సీతను రథం మీద వుంచుకుని యుద్ధభూమికి మళ్ళీ వచ్చాడు. ఆ మాయ సీతను రామ, లక్ష్మణులు చూస్తుండగా చంపి, వారికి మనోదౌర్బల్యం కలిగించాలని అతని ఉద్దేశం.

ఇంద్రజిత్తు యుద్ధభూమికి తిరిగి రావటం చూసి హనుమంతుడు గొప్ప శిలను చేతబట్టుకుని అతని కేసి వచ్చాడు. అతని వెనకగా అనేకమంది వానరవీరులు



శిలలు చేతబట్టి వచ్చారు. అయితే హనుమంతుడికి ఇంద్రజిత్తు రథం మీద ఏడుస్తూ, కృశించిపోయిన సీత కనబడింది. అదిచూసి హనుమంతుడికి కన్నీరు ఆగలేదు. అతను మిగిలిన వానరులను, "ఇంద్రజిత్తు తన రథం మీద సీతాదేవిని ఎందుకు తెచ్చి ఉంటాడు?" అని అడిగాడు.

తరవాత అతను ఆవేశంతో ఇంద్రజిత్తు మీదికి వెళ్ళాడు. వానరసేన తన మీదికి వస్తూండటం చూసి, ఇంద్రజిత్తు తన కత్తితో మాయసీత మెడ మీద రాచాడు. ఆమెను కొట్టి, జుట్టు పట్టుకున్నాడు.

హనుమంతుడికి కన్నీరు ఆగలేదు. అతను ఇంద్రజిత్తుతో, "దుర్మార్గుడా, పాపీ! నువ్వు చేసేపని ఏం పని? ఇలా చెయ్యటానికి నీకు సిగ్గు కూడా లేదా? నువ్వు సీతను చంపావో, త్వరలో నే నువ్వు చస్తావు. నీ కెంత బలం ఉన్నా సరే! నా చేతికి చిక్కావు. నిన్ను ప్రాణాలతో వదలను," అన్నాడు.

ఇంద్రజిత్తు మీదికి వచ్చిన వానర సేనను రాక్షససేన ఎదిరించింది. ఇంద్రజిత్తు హనుమంతుడితో, "ఈ సీత కోసమే గదా నువ్వూ, సుగ్రీవుడూ, రాముడూ లంకకు వచ్చారు? ఆమెను నీ కళ్ళ ఎదటే చంపేస్తాను. తరవాత రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, నిన్నూ, సుగ్రీవుణ్ణీ, ద్రోహి అయిన విభీషణుణ్ణీ చంపేస్తాను. స్త్రీలను చంపరాదంటున్నావు గాని, శత్రువుకు బాధ కలిగించేది ఏదైనా చెయ్యవచ్చు," అన్నాడు.

ఇలా అని, ఏడుస్తున్న మాయ సీతను తన ఖడ్గంతో ఇంద్రజిత్తు నరికాడు. తరవాత అతను వికృతంగా సింహనాదం చేశాడు. ఆ ధ్వనికి బెదిరి వానరులు పారిపోయారు.

హనుమంతుడు వారిని వారిస్తూ, "మీ ప్రతాపమూ, కార్య శూరత్వమూ ఏమయింది? శూరులు యుద్ధం నుంచి వారిపోతారా?" అని వారిని వెనక్కు



అయితే, హనుమంతుడు రాక్షససేనను తరిమికొట్టి, తన వారితో, "ఈ రాక్షస సేనతో మనకేమిటి? మనం సీత కోసం వచ్చాం. సీత చచ్చిపోయింది. ఇంద్రజిత్తు సీతను చంపాడన్న వార్త రాముడికీ, సుగ్రీవుడికీ చెప్పి, వాళ్ళు ఏం చెయ్యమంటే అది చేద్దాం, పదండి," అన్నాడు.

హనుమంతుడు తిరిగిపోవటం చూసి, ఇంద్రజిత్తు హోమం చెయ్యటానికని నికుంభిళ చైత్యానికి వెళ్ళాడు. అక్కడ అతను అగ్నిలో మాంసమూ, రక్తమూ హోమం చేశాడు.

మళ్ళించాడు. ఆ వానర వీరులను వెంట వేసుకుని హనుమంతుడు రాక్షసుల పాలిటి యముడై మహాయుద్ధం చేశాడు.

అతను ఇంద్రజిత్తు రథం మీద బ్రహ్మాండమైన శిలను విసిరాడు. ఇంద్రజిత్తు సారధి యుక్తిగా రథాన్ని తప్పించాడు గాని, దానికిందపడి చాలామంది రాక్షసులు చచ్చారు. రాక్షసులను వానరులు విజృంభించి చంపసాగారు. వాళ్ళు ఇంద్రజిత్తు మీద శిలల వర్షం కురిపించారు. ఇంద్రజిత్తు కోపించి, తన బాణాలతో వానరులను చంపసాగాడు. రాక్షసులకు ఉత్సాహం వచ్చింది.

ఈ లోపల రాముడు వానరులకూ, రాక్షసులకూ కోలాహలంగా యుద్ధం సాగుతూండటం గ్రహించి, అది హనుమంతుడు చేస్తున్న యుద్ధం అయి ఉండాలని జాంబవంతుడితో అన్నాడు. రాముడు ఆజ్ఞాపించిన మీదట జాంబవంతుడు హనుమంతుడికి సహాయంగా పడమటి ద్వారం వద్దకు వెళ్ళాడు.

హనుమంతుడు తన కోసం వచ్చే భల్లూక సేనను చూసి, వారిని వెనక్కు రమ్మన్నాడు. అందరూ రాముణ్ణి చేరుకున్నారు. హనుమంతుడు దుఃఖంతో రాముడికి సీతను ఇంద్రజిత్తు చంపిన సంగతి చెప్పాడు. ఈ వార్త వింటూనే రాముడు కుప్పకూలిపోయాడు. అది

చూసి ఎక్కడెక్కడో ఉన్న వానర ప్రముఖులందరూ రాముడి దగ్గిరికి పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళు రాముడి ముఖం మీద సుగంధ జలం చల్లారు.

లక్ష్మణుడు రాముణ్ణి కౌగలించుకొని ఇలా అన్నాడు: "నువ్వు ధర్మమార్గం అవలంబించి పితృవాక్య పరిపాలన చేశావు; రాజ్యాన్ని వదులుకున్నావు; కైకేయీదశరథుల మీద ఎలాటి కక్ష పెట్టుకోలేదు. కాని నీకే అన్నిరకాల కష్టాలూ వస్తున్నాయి. నీ ధర్మం నిన్ను కాపాడకుండా ఉన్నది. ఈ ధర్మం నిష్ప్రయోజనం అనుకోవలసి ఉన్నది. ఇది అసత్యమైనది. అధర్మం అవలంబించిన రావణుడు మాత్రం సుఖంగానే ఉన్నాడు," అంటూ అతన్ని ఊరడించ యత్నించాడు.

అప్పుడు విభీషణుడు వారున్నచోటికి వచ్చి, రామలక్ష్మణుల దుఃఖం చూసి, సీతను ఇంద్రజిత్తు వధించాడన్న వార్త విన్నమీదట ఇలా అన్నాడు: 'రాముడా, ఈ వార్త నమ్మదగినది కాదు. సీతను నీకు ఇయ్యమంటే వినని రావణుడు సీతను వధించటానికి సమ్మతిస్తాడా? అతను ఆమెను ఏ పరిస్థితిలోనూ వదులు కోవటానికి ఇష్టపడడు. ఇంద్రజిత్తు హోమం చేస్తున్నాడు, ఆ సమయంలో వానరులు తన హోమానికి విఘ్నం కలిగించిపోతారని, వాళ్ళను దుఃఖంలో ముంచి ఉంచటానికి మాయ సీతను వధించి పోయి ఉంటాడు. అతను నిర్విఘ్నంగా హోమం చేసి వచ్చాడంటే దేవతలందరూ ఏకమై వచ్చినా అతన్ని జయించలేరు. అందుచేత ఇంద్రజిత్తు హోమం పూర్తి కాకముందే మనం నికుంభిళకు సైన్యంతో పోదాం. నువ్వు నిశ్చింతగా ఇక్కడే ఉండు. మా వెంట లక్ష్మణుణ్ణి పంపించు. లక్ష్మణుడు ఇంద్రజిత్తు హోమానికి విఘ్నం కలిగించటమేగాక, అతనితో యుద్ధం చేసి చంపి, బ్రహ్మవరం నిజం చేస్తాడు."





# వింతఅనుభవం

వరదరాజులు వజ్రకరూరులో పేరున్న వ్యాపారి. ఆ మధ్య తండ్రి కాలం చేయ డంతో, వ్యాపార బాధ్యతలన్నీ అతడి మీద పడ్డాయి. ఆ సమయంలో అతడి అక్క గారి ఆడబడుచు పెళ్ళి ముహూర్తం వచ్చింది. గర్భవతి అయిన భార్యను ఒంటరిగా ఇంట వదలి, పెళ్ళికి వెళ్ళడం వరదరాజులుకు ఇష్టంలేదు.

అయితే, అతడి భార్య భానుమతి, "అదేంమాట! మామయ్యగారు ఎలాగూ లేరు. ఇక ఈ కుటుంబం తరఫున మీరయినా వెళ్ళకపోతే, ఏమాత్రం మర్యాదగా వుండదు," అని బలవంతం చేసి, భర్త పెళ్ళికి బయలుదేరేలా చేసింది.

పెళ్ళి జరగబోయే ఊరు వరదరాజులు ఏనాడూ చూసి వుండలేదు. అతడు యాభై రూపాయిలకు బాడుగ బండి మాట్లాడు కున్నాడు. దారిలో దట్టమైన అడవికూడా దాటవలసి వున్నది.

మిట్టమధ్యాహ్నంవేళ బండి అడవి దారిలో వుండగా, బండివాడి మేనమామ ఎదురుపడి, వాడికి తల్లి చనిపోయిన సంగతి చెప్పాడు. బండివాడు లబోదిబో మంటుంటే, వాడి మేనమామ వాణ్ణి ఓదార్చి, వరదరాజులుతో, "అయ్యా, మేం ఈ బండిలో వెనక్కు తిరగకపోతే, మా వాడికి తల్లికి తలకొరివి పెట్టే అదృష్టం కూడా వుండదు! మీ రిక్కడే వుండండి, మీకోసం మరొక బాడుగబండి పంపిస్తాం," అంటూ వరదరాజులు జవాబుకోసం కూడా చూడకుండా, బండి వెనక్కు తిప్పి తోలుకుపోయాడు.

వరదరాజులు వుసూరుమంటూ, దారి పక్కన వున్న ఒక మర్రిచెట్టు కింద, సంచీ తలకింద పెట్టుకుని పడుకున్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు



అతడికి క్షణాల మీద నిద్ర ముంచుకు వచ్చింది. తిరిగి అతడికి మెలుకువ వచ్చే సరికి చీకటి పడుతున్నది. వాళ్ళు పంపుతా మన్న బాడుగ బండి జాడ ఎక్కడా లేదు. అతడు త్వరగా అడవి దాటి పోవా లని వేగంగా నడుస్తున్నంతలో, ఆకాశం నిండా మబ్బులు కమ్ముకుని పెద్ద పెట్టున వర్షం ఆరంభమైంది.

ఇంతలో దారి పక్క నుంచి, "అయ్యగారూ, ఆగండి! ఇంత వర్షంలో తడుస్తూ, ఎంత దూరం వెళ్ళగలరు? ఇలా వచ్చి కాసేపు ఆగండి." అంటూ ఎవరో గట్టిగా చప్పట్లు చరుస్తూ పిలవడం, వరద రాజులుకు వినిపించింది.

వరదరాజులు తలతిప్పి చూసి, దారికి పెడగా శిథిలావస్థలో వున్న ఒక గుడిని గమనించాడు. దాని అరుగుమీద నిలబడి వున్న ఒక నిలువెత్తు వ్యక్తి, "అయ్యా, భయపడకండి! నేను రాక్షసుణ్ణో, దయ్యాన్నో కాదు, మీలాంటి మనిషినే!" అంటూ గట్టిగా అరిచాడు.

సంశయిస్తూనే అటుకేసి నడిచాడు, వరదరాజులు. శిథిలమైన గుడి అరుగు మీద కొద్దిపాటి స్థలంలో మాత్రం వర్షం చినుకులు పడడంలేదు.

"రండి, బాబూ! నాపేరు గజపతి. ఉద్యోగం వేటలో వున్న నిరుద్యోగిని. గొప్పింటివారిలా వున్నారు. శుభ్రం చేసిన ఈ స్థలంలో కూర్చోండి." అన్నాడా వ్యక్తి నవ్వుతూ.

"నా పేరు వరదరాజులు. వజ్ర కరూరులో నన్నూ, నా వ్యాపారాన్నీ ఎరుగనివారుండరులే!" అన్నాడు వరద రాజులు దర్పంగా.

ఇద్దరూ చాలాసేపు మౌనంగా కూర్చు న్నారు. ఎంతకూ వర్షం తగ్గే సూచనలు కనిపించడం లేదు.

"ఇలా మనం వర్షంలో చిక్కుబడడం తమాషాగా వుంది. మీ జీవితంలో ఇలాంటి అనుభవం ఏదైనా వుంటే చెప్పండి. కాల క్షేపంగా వుంటుంది!" అన్నాడు గజపతి.

అంత వర్షపు రాత్రివేళ, అడవిలో నిశ్శబ్దంగా కూర్చోవడం వరదరాజులుకు భయంగా వుంది: అతడు ఒకసారి గట్టిగా గొంతుసవరించుకొని, "ముప్ఫైఏళ్ళయినా దాటని నాకు, ఈనాటి వరకూ వింత అనుభవాలంటూ ఏమీ లేవు. అయితే నా జీవితంలో జరిగిన ఒక ముఖ్య సంఘటన చెబుతాను. అది వింతగా వున్నదో లేదో నువ్వే చెప్పాలి!" అంటూ దాన్ని వివరించాడు వరదరాజులు.



వరదరాజులు పట్నంలో చదువుకునే రోజుల్లో, రాజేశం అనే అతను అతడి ఆప్త మిత్రుడు. వరదరాజులు చదువు మాని వ్యాపారం చూసుకోవడం ప్రారంభించాక, ఏదైనా పనిమీద పట్నం వెళ్ళినప్పుడు, రాజేశాన్ని కలుసుకుంటూండేవాడు.

ఒకసారి అలా వరదరాజులు పట్నం వెళ్ళినప్పుడు, రాజేశం తన చెల్లెలికి వస్తున్న పెళ్ళి సంబంధాలను గురించి చెప్పి, "ఈ సంబంధాల్లో అన్నిటికన్నా మంచి సంబంధం ఒకటున్నది. అయితే వాళ్ళు పదివేలు కట్నం అడుగుతున్నారు. నాన్న అంత డబ్బు తన దగ్గిర లేదంటున్నారు," అన్నాడు విచారంగా.

"అంతేకదా! ఆ డబ్బు నేను సర్దుతాను. తర్వాత ఇద్దువుగాని," అని చెప్పి వరదరాజులు ఇంటికి తిరిగి వచ్చాడు.

సంగతి విన్న తండ్రి, వరదరాజులుతో, "నీకేమన్నా మతి పోయిందా? ఇటువంటి మొహమాటాలు పెట్టుకుంటే వ్యాపారం దివాలా తీయడం ఖాయం!' అన్నాడు కోపంగా.

అయినా వరదరాజులు పదివేలు కావాలని పంతం పట్టాడు.

అప్పుడు తండ్రి అతడితో, "అయితే ఇలా చెయ్యి! ఇరవై ఏళ్ళ క్రితం వ్యాపారంకోసం, నామిత్రుడు రామయ్యకు ఐదు వేలు అప్పుగా ఇచ్చాను. వడ్డీతో సహా ఆ మొత్తం నాలుగింతలై వుంటుంది. ఇప్పుడు నువ్వా బాకీలో కనీసం పది వేలయినా వసూలు చేసి, ఆ మొత్తం నీ



దహనం జరగాలి, బాబూ! సమయానికి దేవుడు పంపినట్లుగా వచ్చావు.''అన్నారు.

రామయ్యకు ఆ ఊళ్ళో నా అన్న వాళ్ళెవరూ లేరు. ఒకనాటి తన తండ్రి మిత్రుడు అన్న అభిమానంతో వరద రాజులు, రామయ్య దహన సంస్కారాలు జరిపించాడు. మర్నాడు ఆయన కూతురు భానుమతి, అతడికి రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ, ''మీరెవరో నాకు తెలియదు. కాని ఈ కష్ట సమయంలో దేవుడిలా నన్ను ఆదుకున్నారు,'' అన్నది కళ్ళనీళ్ళతో.

రామయ్యకు ఊరినిండా అప్పులు. ఆ అప్పులన్నిటినీ తన మెడలో వున్న బంగారు గొలుసూ, చేతి ఉంగరాలూ అమ్మి వరద రాజులు చెల్లు వేశాడు. తర్వాత భానుమతితో, ఈ ఇంట్లో ఒక్కదానివీ ఎలా వుండగలవు? నీకేం భయం లేదు! ఒకప్పుడు మీ నాన్నా, మా నాన్నా స్నేహితులు. నావెంట మా ఊరికి వచ్చెయ్యి.'' అన్నాడు.

ఇందుకు భానుమతి ఇష్టపడింది. కాని ఊరివాళ్ళు, ఆమె వరదరాజులుతో వెళ్ళడానికి అభ్యంతరం చెప్పారు. ఏ చుట్టరికమూ లేని కుర్రవాడితో, తమ ఊరి ఆడపడుచును పంపడం, ఊరికే అవమానం; అరిష్టం అన్నారు.

మిత్రుడికి ఇచ్చుకో,'' అని తన మిత్రుడున్న గ్రామం, ఇతర వివరాలూ వరద రాజులుకు చెప్పాడు.

వరదరాజులు రెండు రోజులు ప్రయాణం చేసి, సాయంకాలం వేళ రామయ్య వుండే ఊరు చేరి, అతడింటికి వెళ్ళాడు. ఇంటిముందు జనం మూగి వున్నారు. ఏం జరిగిందో అర్థంకాక అతడు లోపలికి వెళ్ళి చూస్తే, చాప మీద రామయ్య శవం. పక్కనే దుఃఖిస్తున్న ఇరవై ఏళ్ళ అమ్మాయి!

వరదరాజులును చూసి, రామయ్య బంధువుగా భావించిన ఊరి జనం, అతడితో, ''సూర్యాస్తమయం లోపల

అ పరిస్థితుల్లో భానుమతిని వివాహ మాడడం తప్ప, మరేమార్గమూ వరద రాజులుకు కనిపించలేదు. వివాహానికి భానుమతి సంతోషంగా అంగీకరించింది. అతడు ఆ ఊరి వేణుగోపాలస్వామి అల యంలో, ఆ అమ్మాయిని వివాహం చేసు కుని తనవెంట ఇంటికి తీసుకుపోయాడు.

వరదరాజులు ఇదంతా చలపతికిచెప్పి, "పాత అప్పు వసూలు చేయటానికి వెళ్ళిన నేను, వాళ్ళకే ఏనాటి ఋణమో తీర్చాను! వేలు కట్నం వచ్చే అవకాశం వదులుకుని, ఆ పేద ఇంటి పిల్లను భార్యగా తెచ్చుకోవడమే, నా జీవితంలో అతి వింత అయిన అనుభవం,'' అన్నాడు.

అంతా విన్న గజపతి, "ఆహా, అద్భుతం! ఎంతో పసందయిన పురాణం, జానపద కథల స్థాయికి చెందుతుంది, మీ జీవితంలోని ఈ వింత సంఘటన!" అన్నాడు.

అతడు మెచ్చినందుకు చాలా ఆనం దించిన వరదరాజులు, "వర్షం తగ్గే సూచనలు లేవు. నీ జీవితంలో వింత అయిన అనుభవం ఒకటి చెప్పు." అన్నాడు.

ఇందుకు గజపతి విచారంగా తలా డించి, "నాకు నిరుద్యోగిగా నిరాశ అనే అనుభవం తప్ప మరేం లేదు. మీరు స్థితి



పరులు, గొప్ప వ్యాపారులు, ఏదైనా ఉద్యోగం ఇస్తే, ఈ జన్మలో మీమేలు మరువను," అన్నాడు.

ఆ మాటలు వింటూనే వరదరాజులు ముఖంలో రంగులు మారాయి. అతడు చిరాకుగా, "ఇంకా నయం! ఇప్పటికే నా దగ్గిర పదిమంది పనివాళ్ళున్నారు. దారే పోయే వాళ్ళందరికీ ఉద్యోగాలు ఇస్తూ పోతే, ఇల్లు గుల్లవుతుంది. అసలు మనిషి నిజాయితీ చూడకుండా పనిలోకి తీసు కోవడమే!" అంటూ ఆవైపుగా ఏదో బాడుగ బండి రావడం చూసి, అరుగు మీదనుంచి లేచాడు వరదరాజులు. ఆసరికి తెల్లవారింది.

వరదరాజులు బంధువుల ఇంటపెళ్ళికి వెళ్ళి, మర్నాడు సూర్యోదయం వేళకు ఇల్లు చేరాడు. తలుపు తెరుస్తూనే అతడి భార్య భానుమతి, ''వచ్చారా! మీరు తరచూ చెబుతుండేవారే మీ స్నేహితుడు రాజేశంగారు! ఆయన రాత్రి వచ్చాడు. మీరు సమయానికి లేకపోయినా, ఆయనకు తగిన మర్యాద చేసి, పడమటి గదిలో పడక ఏర్పాటు చేశాను,'' అన్నది ఎంతో సంతోషంగా.

ఎక్కడలేని సంతోషంతో పడమటి గదిలోకి వెళ్ళిన వరదరాజులు నిర్ఘాంత పోయాడు. అక్కడ మంచంమీద రాజేశం లేడు. దిండుకింద ఒక ఉత్తరం మాత్రం వున్నది. అతడు దానిని తీసుకుని చదివాడు. అందులో ఇలా వున్నది—

వరదరాజులుగారూ! నేను గజపతిని, రాజేశం కాదు. మీరు నా నిజాయితీని శంకించి, ఉద్యోగం ఇవ్వనన్నారు, సరే! మీరు అడవిలో చెప్పిన కథలోని రాజేశాన్ని గుర్తుంచుకుని, దానితోపాటు మరికొన్ని వివరాలు మీ భార్యకు చెప్పాను. అందువల్ల ఆమె నేను రాజేశాననుకొని, అన్ని మర్యాదలూ చేసింది. నేను మీరు డబ్బు దాచే పెట్టెలోంచి కేవలం పదివేలు మాత్రమే అప్పుగా తీసుకున్నాను. దీనితో నాకు తెలిసిన వ్యాపారం చేసి, రెండేళ్ళల్లో మీ అప్పు తీర్చేస్తాను. మొన్న మీరడిగిన నాటికి, నా జీవితంలో వింత సంఘటన అంటూ ఏమీ జరగలేదు. ఇప్పుడిదే వింత సంఘటన.

గడప దగ్గిర నిలబడి అంతా చూస్తున్న భానుమతి, ''మీ మిత్రుడు చెప్పాపెట్టకుండానే వెళ్ళిపోయాడే! ఆ ఉత్తరంలో ఏం రాశాడు?'' అని అడిగింది చాలా ఆశ్చర్యంగా.

"మరేం లేదు! నా తెలివితక్కువతనాన్ని ఎత్తిచూపుతూ, నిజాయితీ అంటే ఏమిటో తెలియపరిచాడు. ఏమైనా అంత నిజాయితీ పరుడు వడ్డీతో సహా అప్పు తీర్చకపోడులే!'' అంటూ ఉత్తరాన్ని భద్రంగా పెట్టెలో దాచాడు వరదరాజులు.





# మాటతప్పనివాడు

పూర్వం టర్కీదేశంలో అబ్దుల్ హమీద్ అనే వర్తకుడు ఉండేవాడు. ఆయన దగ్గిర ఒక అపూర్వమైన అరేబియాజాతి గుర్రం ఉండేది. ఆయనకు ఆ గుర్రం అంటే చాలా ఇష్టం. కాని వయసు మీరిపోవడం చేత ఆయన దాని మీద స్వారి చెయ్యలేక, దానిని అమ్మెయ్యడానికి నిశ్చయించాడు. దానిని ఆయన మూడు వందల దీనారాలకు అమ్మాలనుకున్నాడు. కాని అంత ధర ఇచ్చి కొనేవారు లేకపోయారు.

ఒకరోజున అజీజ్ అనే యువకుడు అబ్దుల్ హమీద్ వద్దకు వచ్చి, వినయంగా సలాము చేసి, "అయ్యా, నేను ఉన్నత కుటుంబంలో పుట్టినవాణ్ణేగాని చాలా బీదవాణ్ణి. మీ గుర్రం మీద నాకు చాలా మక్కువ. అయితే, దాని ధర ఇచ్చుకోలేను. మీరు దయతో ఆ గుర్రాన్ని నాకు ఇచ్చినట్టయితే దూరదేశాలకు పోయి సంపాదనపరుణ్ణి కావాలనుకుంటున్నాను. ఒక సంవత్సరానికి తిరిగి వచ్చి, నేను ఈ లోపుగా సంపాదించినదంతా గుర్రం మూల్యం కింద మీకు ఇచ్చుకుంటాను. ఇందుకు తప్పనని మీకు మాట ఇస్తున్నాను," అన్నాడు.

హమీద్ కొంచెంసేపు ఆలోచించి, "సరే, నువ్వు పెట్టిన షరతు ప్రకారం గుర్రాన్ని తీసుకు వెళ్ళు," అంటూ చెర్నాకోల తెచ్చి అజీజ్ చేతికి ఇచ్చాడు.

అజీజ్ సంతోషంగా ఆ గుర్రాన్ని ఎక్కి తన అదృష్టాన్ని వెతుక్కుంటూ దేశాల వెంట బయలుదేరాడు.

కొంతకాలం ప్రయాణం చేసి అతను ఒక పట్టణం చేరుకున్నాడు. అతను రాజప్రాసాదం ముందునుంచి వెళుతూండగా, కిటికీ దగ్గిర నిలబడిన రాజుగారి దృష్టి అజీజ్ ఎక్కిన గుర్రంపై పడింది; ఆ అరే

టర్కీ జానపద కథ



రాజుకు అధర భయంకరంగా తోచింది. కాని గుర్రాన్ని వదలబుద్ధి కాలేదు. అందు చేత ఆయన అజీజ్‌తో, "నువ్వు చాలా హెచ్చు ధర చెబుతున్నావు. నన్ను కొంచెం ఆలోచించుకోనియ్యి. రేపు ఉదయం ధర పరిష్కరించుకుందాం," అని అతన్ని పంపేశాడు.

అజీజ్ వెళ్ళిపోయాక రాజు తన మంత్రులను పిలిచి, ఆ అపూర్వమైన గుర్రాన్ని తక్కువ ధరకు కొనే ఉపాయం చెప్పమన్నాడు. ఎవరికి తోచిన ఉపాయం వారు చెప్పారు, కాని అవేవీ రాజుకు ఏ మాత్రం నచ్చలేదు.

అప్పుడు ముఖ్యమంత్రి, "మహారాజా, రేపు ఆ యువకుణ్ణి మన ఉపవనంలో కలుసుకునేటప్పుడు రాజకుమార్తెను దగ్గిర ఉంచుకుని, ఆమె ద్వారా కూడా బేరం సాగించండి. అతను తగ్గిరాక ఏం చేస్తాడు? కాకపోయినా, వంట ఇంటి కుందేలు! గుర్రాన్ని మనం అడిగిన ధరకు ఇవ్వకుండా అతను మననుంచి తప్పించుకుని నగరం దాటి ఎక్కడికి పోగలడు?" అని సలహా ఇచ్చాడు.

ఈ సలహా రాజుకు నచ్చింది. ఆయన మర్నాడు ఉదయం అజీజ్‌ను తోటలోకి తీసుకు రమ్మని, తనకన్న ముందుగా తన కుమార్తెను తోటలోకి పంపాడు.

బియా జాతి గుర్రం తన వద్ద ఉంటే బాగుండుననిపించింది.

రాజు వెంటనే తన నౌకర్లను అజీజ్ బసచేసి ఉన్న సత్రానికి పంపి, అతన్ని పిలిపించి, "నీ గుర్రాన్ని నేను కొనాలను కుంటున్నాను. దాని వెల ఎంత?" అని అడిగాడు.

అజీజ్‌కు ఆ గుర్రాన్ని అమ్మాలని లేదు. కాని రాజు పిలిపించి అడిగినప్పుడు అమ్మ ననడం భావ్యం కాదు గనక, హమీద్‌కు హెచ్చు సొమ్ము ముట్టజెప్పి సంతోష పెట్టా లన్న ఉద్దేశంతో, "మహారాజా, దీని వెల తొమ్మిది వందల బంగారు దీనారాలు," అని చెప్పాడు.

అజీజ్ తన గుర్రం మీద వచ్చేసరికి రాజకుమార్తె తోటలో చలువరాతి తిన్నె మీద ఒంటరిగా కూర్చుని ఉన్నది. ఆమెకు అజీజ్ చాలా అందంగా కనిపించాడు. ఆ గుర్రం మీద స్వారి చెయ్యటానికి తన ముసలితండ్రి కన్న అతనే యోగ్యుడని ఆమెకు అనిపించింది. అతడే తనకు తగిన భర్త అనికూడా ఆమె భావించింది.

ఆమె గుర్రాన్ని చూస్తున్న దానిలాగా అతన్ని సమీపించి, "నువ్వ ఈ గుర్రాన్ని చౌకగా అమ్మకపోతే నీ ప్రాణాలకే ప్రమాదంఉన్నది. అందుచేత తప్పించుకు పారిపోవటం తప్ప నీకు వేరే మార్గం లేదు. నాదగ్గిర ఒక అంగరఖా వున్నది.దాని నిండా అనేకవేల దీనారాలు కుట్టి ఉన్నాయి. మా నాన్న రాగానే దాహంగా ఉందని అడుగు. నేను వెళ్ళి అంగరఖా తొడుక్కొని మంచి నీరు తెస్తాను. ఆ తరవాత మన మిద్దరమూ గుర్రం మీద ఎక్కడికైనా పారిపోదాం," అన్నది.

ఇంతలో రాజు వచ్చాడు. అజీజ్ తనకు దాహం అవుతున్నదన్నాడు. రాజకుమార్తె లోపలికి వెళ్ళి, అంగరఖా ధరించి నీళ్ళతో తిరిగి వచ్చింది. అజీజ్ నీరు అందుకో బోతున్నట్టుగా చేతులుచాచి, ఆమెను పట్టుకుని గుర్రం మీద ఎక్కించి, తాను కూడా ఎక్కి, మెరుపులాగా మాయమయ్యాడు.

రాజు జరిగినది గ్రహించి అతని వెనకగా అశ్వికభటులను పంపాడు గాని వాళ్ళు అజీజ్‌ను అందుకోలేక పోయారు.



అజీజ్ రాజకుమార్తెతో కలిసి అనేక దేశాలు తిరిగాడు. వారికి రోజులుహాయిగా గడిచిపోయాయి.

సంవత్సరం గడువు పూర్తికావచ్చింది. రానున్న దాన్ని తలుచుకుని అజీజ్ కుంగిపోసాగాడు. అతని విచారం గమనించి రాజకుమార్తె కారణం అడిగింది.

అజీజ్ అబ్దుల్ హమీద్‌తో తాను చేసుకున్న ఒప్పందం గురించి ఆమెకు చెప్పి, "ఈ గుర్రం ద్వారా నేను సంపాదించుకున్నదంతా హమీద్‌కు ఇచ్చేస్తానని ప్రమాణం చేశాను. ఆయన కివ్వవలసిన దానిలో నీ అంగరఖా, నువ్వూ కూడా ఉన్నారు. కాని నిన్ను విడిచి నేను బతకలేను," అని గోలపెట్టాడు.

రాజకుమారి ఆశ్చర్యంతో, "ఇదేమిటి! నువ్వు నన్ను గెలుచుకున్నావు. నీ మీది ప్రేమచేత నేను నా వాళ్ళందరినీ విడిచిపెట్టి నీ వెంట వచ్చాను. హమీద్‌కు మన విషయం ఏమీ తెలియదు. కావలిస్తేగుర్రం మూల్యం కింద హమీద్‌కు వెయ్యి దీనారాలు ఇచ్చెయ్యి. సంతోషిస్తాడు," అని సలహా ఇచ్చింది.

కాని అందుకు అజీజ్ ఒప్పుకోలేదు. తమకు ఎంత కష్టమైనాసరే, ఆడినమాట తప్పనని అతను పట్టుబట్టాడు. గడువు లోపలవాళ్ళు హమీద్ ఉన్నచోటికి చేరారు.

అజీజ్ హమీద్‌కు సలాం చేసి, "నేను చాలా దూర దేశాలు తిరిగి వచ్చాను. మీరిచ్చిన గుర్రం వల్ల ఈ రాజకుమారినీ, బంగారు కాసులు కుట్టిన ఈ అంగరఖా సంపాదించాను. గుర్రం మూల్యం కింద వీటిని స్వీకరించండి," అన్నాడు.

ఉదారబుద్ధి గల హమీద్‌కు అజీజ్‌ను చూసి ఆనందం కలిగింది; జాలి కూడా వేసింది. ఆయన చిరునవ్వు నవ్వి, "నీ నిజాయితీ మెచ్చదగినది. ఈ అంగరఖా నాకు ఉపయోగపడుతుంది. ఇందులో ఉన్న బంగారం చెరిసగం తీసుకుందాం. గుర్రాన్నీ, రాజకుమార్తెనూ నువ్వే ఉంచుకో," అంటూ అజీజ్‌నూ, రాజకుమార్తెనూ మనసార దీవించాడు.



# ప్రకృతి వింతలు :





## బుల్లిపిట్ట - బోలెడు గూళ్ళు!




జీనువాయి పిట్ట (జెనీరెన్)కు తోక చిన్నదే గాని, లాటిన్ భాషలో 'ట్రోగ్లోడైట్స్ ట్రోగ్లోడైట్స్' అనే పెద్ద పేరు ఉన్నది ఇది చాలా చిన్న పిట్టే గాని, పెద్ద పక్షులపై సైతం ధైర్యంగా దాడిచేస్తుంది. మగపిట్టకు గూళ్ళు కట్టడం అంటే మహా సరదా. ఆడపిట్ట గుడ్లు పెట్టడానికి మగపిట్ట చాలా గూళ్ళు కడుతుంది. వాటిలో తనకు నచ్చిన గూటిలో ఆడపిట్ట గుడ్లు పెడుతుంది.






## కీటకాల శక్తి!

మామూలుగా ఎగిరే చిన్న కీటకాలు క్షణంలో వాటి శరీర పరిమాణానికి పందరెట్లుకన్నా ఎక్కువ దూరం ఎగర గలవు. అవి వెనుకకుగూడా ఎగర గలవు.

చీమ పదహారేళ్ళ వరకు జీవించ గలదు. చీమలు తమ పుట్టలలో చిన్న చిన్న క్రిమి కీటకాలకు ఆశ్రయం ఇచ్చి, వాటినుంచి స్రవించే తియ్యటి ద్రవాలను తాగుతాయి. అందువల్ల ఆ క్రిమి కీటకాల రక్షణకు కాపలా ఏర్పాటు చేస్తాయి.

మానవనిర్మితాలయిన ఈజిప్టు పిరమిడ్లులాగా తెల్లచీమలు 15 - 20 అడుగుల ఎత్తయిన పుట్టలు పెడతాయి.




## అతిపెద్ద గబ్బిలాలు!

సస్తనజంతువులలో ఎగర గలవి గబ్బిలాలు మాత్రమే. ఇండోనేసియా, మలేసియా ప్రాంతాలలో 'కెలాంగ్' అనే ఒక రకం అతిపెద్దగబ్బిలాలు ఉన్నాయి. వీటి రెక్కల పొడవు ఆరడుగులు!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 నవంబరు నెల సంచికలో ప్రకటింపబడును.



K. S Vijayakar



M. Kameswara Rao

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబరు నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఈ చిట్టితల్లి కవ్వింత ! రెండవ ఫోటో: నవ్విస్తోందా నిన్నింత ?

పంపినవారు: కె. ఎ. ఎల్. సత్యవతి, జూనియర్ అసిస్టెంట్, O/o. జాయింట్ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్, మహబూబ్‌నగర్ - 509 001 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---


ఇంట్లో
డాక్టర్‌తో!


డాక్టర్ లీలగావున్న ఒకరోజు...
నీవు ఈ మధ్య స్వీట్స్ ఎక్కువగా తింటున్నావా?
ఒక్క స్వీట్లేనా... ఐస్‌క్రీమ్‌లూ... కేకులూ...


ఐతే ఏదీ... నీ పళ్లు పరీక్ష చేయనీ..
ఆ.. ఆ..


అబ్బ! ఎన్ని క్రిములో!


!!!


ఈ క్రిములు నోటి నలుమూలలా పెరిగి నీ పళ్లకి బెజ్జాలు పెడతాయి.
బెజ్జాలే!!


నీ పళ్లు గట్టిగా వుండాలంటే క్రిములుండకూడదు.


మీ మమ్మీకి తెలుసా. క్రిములతో పోరాడే టూత్‌పేస్ట్ ఏదో? కొత్త పెప్సొడెంట్ తెమ్మని అమ్మకి చెప్పండి. ఇందులో విప్లవాత్మకమైన జెర్మి-చెక్ ఫార్ములా వుంది. పెప్సొడెంట్ క్రిములతో పోరాడటమే కాదు... వాటి నుంచి రక్షణనిస్తుంది. దాంతో మీ పళ్లు గట్టిగా ఆరోగ్యంగా వుంటాయి.




NEW
Pepsodent

